# అర్జునుడు

## ఏకాగ్రత, సంకల్ప శక్తి, వ్యక్తిత్వనిర్మాణం


రచన
అమిరపు నటరాజన్


సలహామండలి
అమిరపు సురేష్
ఆచార్య పన్నాల శ్యామసుందరమూర్తి
డా॥ నెమ్మాని రామగోపాల్
బేతాళం శ్రీనివాసరాజు
చిరువోలు శ్రీధర్ I.A.S
కె.వి. రామగోపాల శర్మ
ఆచార్య శ్రీమతి చందలూరి చిరంజీవి
అమిరపు నరేష్

చిత్రాలు
కోటి జాన్ అగస్టీన్


ప్రకాశకులు
**శ్రీరామకృష్ణ సేవా సమితి**
**బాపట్ల - 522 101**

ప్రకాశకులు
**శ్రీరామకృష్ణ సేవా సమితి**
రామకృష్ణ కాంప్లెక్స్ రోడ్
విజయలక్ష్మీపురం, **బాపట్ల - 522 101**
e-mail : rksamithibapatla@gmail.com
web-site : www.unworldliness.org
ప్రతుల కోసం పై చిరునామాను సంప్రదించగలరు.



ప్రథమముద్రణ: అక్టోబరు, 2015 3000 కాపీలు

**కృతజ్ఞతలు :** సలహా మండలి రూపంలో తమ అమూల్యమైన సలహాలతో ఈ పుస్తకాన్ని పాఠకులకు మరింత ఉపయోగకరంగా తీర్చిదిద్దడానికి తోడ్పడిన మా సమితి సభ్యులకు కృతజ్ఞతలు.

సమితి బాలవిహార్ సభ్యుడిగా ఎదిగి, శిల్పకళలో అద్భుతంగా రాణిస్తున్న చిరంజీవి కోటి జాన్ అగస్టీన్ ఈ పుస్తకంలోని బొమ్మలను చిత్రించాడు. అతడికి మా ఆశీస్సులు.

– ప్రకాశకులు

**ముఖచిత్ర వివరణ:** ముఖచిత్రంలో విలువిద్యలో బాణాలు ప్రయోగించే 'బుల్స్ ఐ' చూపబడింది. అది ఏకాగ్రతను సూచిస్తుంది. చేసే పనిలో మనం చూపే ఏకాగ్రతయే మనకు గొప్ప కౌశలాన్ని కలిగించి, యోగస్థితిని సాధించేలా చేస్తుంది.

## ప్రకాశకుల మనవి

భారతదేశంలో ఏ పిల్లవాడైనా సరే, ఒక పుల్లను సంపాదించి, దానిని విల్లులాగా వంచి, దానికి ఒక దారం కట్టి, మరొక పుల్లను బాణంలాగా దానిలో పెట్టి వదులుతూ ఉంటే చాలు, "నేను అర్జునుణ్ణి!" అంటాడు. విల్లుతో బాణం వేసేవాడంటే అర్జునుడే అందరికీ గుర్తుకు వస్తాడు. మన సంస్కృతిలో అర్జునుడు సంపాదించినది అంతటి పేరు.

మరి ఈ అర్జునుడు ఎవరు? అయిదుగురు పాండవులలో అతడు మధ్య వాడు. మరి అతడు మహారాజు అయ్యాడా? కాలేదు. కేవలం తన అన్న అయిన ధర్మరాజుకు సేవకుడిగా ఉన్నాడు. మరి అతడి గురించి అందరూ ఎందుకు చెప్పుకుంటున్నారు? ఎందుకంటే విలువిద్యలో అతడు సాధించిన కౌశలం అలాంటిది; వ్యక్తిగతంగా పెంపొందించుకున్న శీలం అలాంటిది.

ఎలాగైతే ఒక దీపం మరొక దీపాన్ని వెలిగించగలదో, అలాగే ఒక గొప్ప మనిషి జీవితాన్ని ఆదర్శంగా తీసుకుని మన జీవితాల్ని మలచుకున్నప్పుడు, మనం కూడా అటువంటి ఉన్నతిని సాధించగలుగుతాము. అర్జునుడు మనకు అలాంటి స్ఫూర్తిని ఇవ్వగలిగినవాడు. మహాభారతంలో, అర్జునుడు విలు విద్యలో గొప్ప కౌశలాన్ని సాధించిన విధానం, తన జీవితంలో అతడు దానిని ఉపయోగించుకున్న తీరు, మనకు ఎన్నో పాఠాలు నేర్పగలవు. అర్జునుడి జీవితకథలోని అనేక సంఘటనలతో వివేకానంద స్వామి బోధనలను జతపరచి, కూర్చి ఈ పుస్తకాన్ని తయారుచేసిన అమిరపు నటరాజన్ గారికి మా కృతజ్ఞతలు. ఇందులోని భావాలన్నీ శ్రీ వివేకానంద స్వామి బోధనల స్ఫూర్తితో వ్రాయబడినవే. ఈ పుస్తకంలోని కొన్ని విషయాలను గురించి మరింత ఎక్కువ చదివేందుకు వీలుగా మా ఇతర ప్రచురణల పేర్లను ఆయా సందర్భాలలో సూచించాము. ఉన్నత పాఠశాల, కళాశాల విద్యార్థులను ఉద్దేశించి వ్రాయబడిన ఈ పుస్తకంలో తరచుగా ఉపయోగించబడిన 'స్వామీజీ' అనే మాట శ్రీ వివేకానంద స్వామిని సూచిస్తుంది.

విద్య అనేది పొట్టకూటి చదువుగానే మిగలక, మనిషికి కౌశలాన్ని ఇచ్చి తద్వారా అతడు యోగస్థితిని చేరేందుకు సహాయపడాలి. యోగారూఢుడయిన అర్జునుడి గురించి వివరించిన ఈ చిన్న పుస్తకం ఈ తరం విద్యార్థులకు అటువంటి కౌశలాన్ని సాధించేందుకు ప్రేరేపించాలన్నదే మా ఆశయం.

అక్టోబర్, 2015. ప్రకాశకులు

# విషయసూచిక

| | |
|---|---|
| ముందుమాట | 6 |
| 1. మన వైఫల్యాలకు కారణం | 9 |
| 2. మన వైఫల్యాలకు విరుగుడు | 11 |
| 3. సమరోత్సాహం కావాలి | 13 |
| 4. అరకొరగా పనిచేయకూడదు | 14 |
| 5. విజయానికి, కౌశలానికి తేడా | 15 |
| 6. కౌశలాన్ని సాధించిన కొందరు వ్యక్తులు | 19 |
| 7. కౌశలం యొక్క అవసరం | 22 |
| 8. మహాభారతానికి పరిచయం | 24 |
| 9. అర్జునుడు | 26 |
| 10. పాండవ, కౌరవుల బాల్యం | 27 |
| 11. 'నేను సాధించగలను!' | 28 |
| 12. కొత్త విషయాలను అన్వేషించాలి | 30 |
| 13. అర్జునుడు చూపిన గొప్ప శక్తి - ఏకాగ్రత | 33 |
| 14. ఏకాగ్రత - ఏమిటి? ఎందుకు? | 35 |
| 15. రోజువారీ జీవితంలో ఏకాగ్రత | 36 |
| 16. కొండంత బలం కావాలి | 43 |
| 17. మనస్సుకు ఏకాగ్రత అలవరచడం ఎలా? | 47 |
| 18. మనకున్నది ఒకటే మనస్సు! | 49 |
| 19. ప్రయత్నంతో పనిచేసే బుద్ధి | 51 |
| 20. ఏకాగ్రతను సాధించడానికి కొన్ని ఆచరణాత్మక పద్ధతులు | 54 |
| 21. ఏకాగ్రత కలిగిందని ఎలా తెలుస్తుంది? | 58 |
| 22. విద్యార్థి ఎలా ఉండాలి? | 61 |
| 23. నేర్చుకోవాలన్న శ్రద్ధే అసలైన గురువు | 64 |
| 24. తయారుగా ఉండడమే విజయ రహస్యం | 65 |
| 25. గుర్తింపు సాధించేది ఎలా? | 68 |

26. శీలంతో కూడిన నైపుణ్యం కావాలి 72
27. ప్రలోభాలకు లొంగకూడదు 74
28. లక్ష్యాన్ని గురించే ఆలోచించండి!
దానినే కలగనండి! దానినే జీవించండి! 77
29. పోరాడేవాడు ఏ ఆయుధంతోనైనా పోరాడతాడు 79
30. పనిని సరిగా చేసేవాణ్ణి
స్వర్గమే వెతుక్కుంటూ వస్తుంది! 81
31. మన శీలమే మనకు శ్రీరామరక్ష 84
32. సంకల్పశక్తి – ఏకాగ్రత 85
33. సంకల్పశక్తిని పెంపొందించుకోవడం ఎలా? 89
34. శాపాలను వరాలుగా మార్చుకోగలగాలి! 92
35. కష్టాలను ఎలా ఎదుర్కోవాలి? 93
36. పరిస్థితులకు అనుగుణంగా
నడచుకోవడమే నేర్పరితనం 95
37. చేసే పనిని ఆలోచించి చేయాలి 97
38. యుద్ధంలో వెన్నుచూపేకన్న మరణమే మేలు 100
39. ఆత్మవిశ్వాసమే అమోఘమైన బలం 103
40. నిజమైన బలవంతుడే బలహీనులకు
సహాయపడగలడు 104
41. "ఒక్కడె చాలు!" 105
42. ఆత్మవిశ్వాసం, దైవసహాయం 108
43. మానవజీవితమే ఒక కురుక్షేత్ర సంగ్రామం 111
44. దుర్మార్గాన్ని ఎదుర్కోగలవాడే క్షమ చూపగలడు 114
45. కోరిక లేకుండా పనిచేయడమే గీతాసందేశం 117
46. భయమే అన్ని దుర్మార్గాలకూ మూలం 118
47. దుఃఖాన్ని దిగమ్రింగాలి, యుద్ధాన్ని కొనసాగించాలి! 122
48. అంతిమవిజయం 125
49. ఉపసంహారం 127



## ముందుమాట

ఏకాగ్రత అనే విషయం మీద అనేక పుస్తకాలు ఉన్నాయి. వ్యక్తిత్వనిర్మాణం మీద లెక్కలేనన్ని పుస్తకాలు ఉన్నాయి. ప్రతి రచయిత తనదైన శైలిలో, తన భావజాలం ప్రకారం వ్రాస్తాడు. ఇవన్నీ చదివి, ఏది అనుసరిస్తే తమకు శ్రేయస్కరమో అర్థంకాక, పాఠకులు తికమకపడుతూ ఉంటారు. ఈ పుస్తకాలలో చాలా తక్కువ పుస్తకాలు మాత్రమే సరిగా అర్థం చేసుకునేందుకు వీలుగా, తగిన త్రోవ చూపేవిగా, తగిన ఉదాహరణలను ఇచ్చేవిగా ఉంటాయి. అటువంటి పరిస్థితిలో, మనకు మార్గదర్శి కాగలిగి, మనం ఆదర్శంగా చేపట్టదగిన వ్యక్తిని ఉదాహరణగా చూపడమనేది ఇంకా అరుదు. అటువంటి ఆదర్శవ్యక్తులను చూపవలసిన అవసరం ఈనాడు ఎంతైనా ఉంది. ఉన్నతమైన భావాలను ఇబ్బడిముబ్బడిగా బోధించడమైతే చాలానే కనిపిస్తుంది వాటిని ఎలా ఆచరణలో పెట్టాలో ఎక్కడా కానరాదు. చూసి, అనుసరించగలిగే ఆదర్శవ్యక్తులు మనకు కావాలి.

మహాభారతంలో వర్ణించబడిన అర్జునుడి ఔన్నత్యాన్ని మనం ఈ పుస్తకం ద్వారా తెలుసుకోవచ్చు. అతడు మహావీరుడుగానూ, అజేయుడుగానూ, గొప్ప విలుకాడు గానూ మనందరికీ తెలుసు. అయితే అతడు సాధించిన విజయాలకు మూలకారణం ఏమిటి? అతడు తన నైపుణ్యాలను, సంకల్పశక్తిని ఎలా పెంపొందించుకున్నాడు? తన వ్యక్తిత్వాన్ని ఎలా తీర్చిదిద్దుకున్నాడు? ఈ ప్రశ్నలకు

సమాధానాలను చూపడమే కాక ఏకాగ్రత, సంకల్పశక్తి వంటి ఉదాత్తమైన గుణాలను ఎలా పెంపొందించుకోవాలో, మన వ్యక్తిత్వాన్ని ఎలా నిర్మించుకోవాలో ఈ పుస్తకంలో చక్కగా వివరించారు.

సాధారణంగా మనం అనుకుంటున్నట్టు, వ్యక్తిత్వం అంటే ఉన్నతవిద్యలో కొన్ని పట్టాలను సంపాదించి, సమాజంలో ఉన్నతమైన స్థితిని పొందడం కాదు. శరీరానికి అలంకారం చేసుకోవడంవల్ల కూడా ఏ ఫలితమూ ఉండదు. ఎందుకంటే మనం పైపైన చేసుకునే సోకులు కొద్దికాలమే ఉంటాయి.

కొందరు వ్యక్తులు అతి కొద్ది సమయంలో సమాజం మీద గొప్ప ప్రభావాన్ని చూపగలుగుతారు. కానీ కొందరు ఎంత కాలం గడిచినా ఎటువంటి ప్రభావాన్నీ చూపలేరు. అలా ఎందుకు జరుగుతుంది? ఎందుకంటే ఆ ప్రభావకరమైన వ్యక్తులు ఉన్నత విలువలను జీవితంలో ఆచరణలో పెట్టడం ద్వారా తమ వ్యక్తిత్వంలో మార్పు తీసుకువచ్చారు. అదే వారి ప్రభావానికి కారణం.

సంస్కృతంలో ఒక శ్లోకం ఉంది.

**మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః ।**
**మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనామ్ ॥**

***మహాత్ముల విషయంలో ఆలోచనలు, మాటలు, చేతలు అన్నీ ఒకటిగా ఉంటాయి. కానీ మామూలు వ్యక్తుల విషయంలో, దుర్మార్గుల విషయంలో ఆలోచనలు, మాటలు, చేతలు, మూడూ వేరువేరుగా ఉంటాయి. వారు ఒకటి ఆలోచించి, మరొకటి మాట్లాడి, వేరొకటి చేస్తారు!***

ఈ శ్లోకాన్ని చదివారు కదా! ఇప్పుడు మహాత్ములు కాని వారు ప్రపంచం మీద ఎలా ప్రభావం చూపగలరో మీరే చెప్పండి!

---

సమాజం మీద మనం ప్రభావాన్ని చూపాలంటే ఏకాగ్రత ను గొప్పగా సాధన చెయ్యాలి. జీవితాన్ని సక్రమమైన మార్గంలో, నీతిమంతంగా నడపాలి. మన జీవితంలోని ప్రతి అంశాన్నీ ఏకత్రాటిపైకి తీసుకురావాలి. అటువంటి వ్యక్తిత్వాన్ని సమగ్రవ్యక్తిత్వం అంటారు.

ఈనాటి యువత, అర్జునుడి వ్యక్తిత్వం నుంచి నేర్చుకో వలసిన లక్షణాలు ఎన్నో ఉన్నాయి. అతణ్ణి అనుసరించ వలసిన అవసరం ఉంది. ఎంతో శ్రమించి, మహాభారత కథలో అర్జునుడి వ్యక్తిత్వానికి సంబంధించిన సంఘటనలను ఎంచి, వాటిని వివేకానంద స్వామి బోధనలతో కూర్చి, శ్రీ అమిరపు నటరాజన్ ఈ పుస్తకాన్ని రచించారు. మహావీరుడైన హనుమంతుని జీవితం మీద కూడా శ్రీ నటరాజన్ ఇటువంటి పరిశోధననే ఇంతకు ముందు చేశారు. నేటి యువత శ్రేయస్కరమైన మార్గంలో ముందుకు నడవడానికి, శ్రేయోదాయకమైన ప్రవర్తనను చేపట్టడానికి ఆయన చేస్తున్న ప్రయత్నాన్ని అభినందించాలి.

ఈనాటి యువతకు ఈ పుస్తకం గొప్పగా సహాయపడగలదని ఆశిస్తున్నాను.

Swami Aksharatmananda

స్వామి అక్షరాత్మానంద

కార్యదర్శి,

రామకృష్ణ మిషన్,

చెంగల్‌పట్టు, తమిళనాడు

16 సెప్టెంబరు, 2015

# అర్జునుడు

## ఏకాగ్రత, సంకల్పశక్తి, వ్యక్తిత్వనిర్మాణం

### 1. మన వైఫల్యాలకు కారణం

ఒక అడవిలో ఒక నక్క ఉంది. ఒకనాడు అది ఆహారం కోసం అడవికి దగ్గరలో ఉన్న ఊరిలోకి ప్రవేశించింది. ఊరకుక్కలు దానిని తరిమాయి. అది పారిపోతూ, ఒక చాకలి గుడిసెలో దూరి, అక్కడ ఉన్న ఒక బానలో పడిపోయింది. ఆ బానలో నీలిరంగు ఉంది. ఆ రంగులో మునిగిన నక్క నీలంగా తయారయింది. ఊరకుక్కలు దాని కోసం కొంతసేపు వెతికి, అది కనపడక, వెళ్ళిపోయాయి. తర్వాత నక్క బానలోనుండి బయటపడి, ఎలాగో అడవికి చేరింది. అయితే, విచిత్రంగా, అడవిలో జంతువులన్నీ ఆ నీలిరంగు నక్కను చూచి, అది ఏదో క్రొత్త జంతువు అను కుని భయపడి పారిపోసాగాయి. ఇది గమనించిన ఆ నక్కకు ఒక మంచి ఉపాయం తట్టింది. ఆ ఉపాయం అమలు చేసిన తర్వాత తాను పొందబోయే రాజభోగాలను తలుచుకుని తనలో తాను సంబరపడుతూ, 'తంతే బూరెల బుట్టలో పడ్డాను!' అనుకుంది. అన్ని జంతువులూ తనను చూసి భయ పడుతున్నాయి కాబట్టి వాటిని మరింత తికమకపెట్టి, తానే వాటికి రాజు కావచ్చునన్నది ఆ నీలినక్క వేసిన పథకం.

ఆ నీలినక్క ఠీవిగా, నిటారుగా, మోర పైకెత్తి నిలబడి, ఆ పారిపోయే జంతువుల్ని పిలిచి, "మీరేమీ భయపడవలసిన

పనిలేదు. ఆ బ్రహ్మదేవుడు నన్ను మీకు రాజుగా పంపించాడు. నేను ఈ వనానికి రాజును. మీరంతా నా ఆజ్ఞను పాటించాలి!" అని గంభీరంగా పలికింది.

ఇక, ఆ వింత మృగాన్ని దేవుడే పంపాడని ఆ జంతువులు నమ్మాయి. పెద్దపెద్ద జంతువులే దానికి లొంగిపోయాయి. చివరికి సింహం, పులి కూడా తాము వేటాడి తెచ్చిన మాంసాన్ని ముందుగా ఆ నీలినక్క ముందు ఉంచేవి. ఆ నక్క మంచి మాంసమంతా తాను కడుపారా తిని, మిగిలిన ఎముకల ముక్కల్ని వాటికి ఇచ్చేది.

ఇలా ఉండగా ఒక వెన్నెలరాత్రి అడవిలోని నక్కలన్నీ పెద్దగా ఊళ వేయడం మొదలు పెట్టాయి. అలా చేయడం నక్కల సహజ ప్రవృత్తి. అందువలన ఆ కూతలు చెవిన పడగానే ఆ నీలినక్క మైమరచి పోయింది. తాను కూడా వాటితో గొంతు కలిపి ఊళ వేసింది. అప్పుడు అది మామూలు నక్కేనని అన్ని మృగాలకూ తెలిసిపోయింది. అవి ఆ నీలినక్కను చంపివేశాయి.[1]

పంచతంత్రంలో చెప్పిన ఈ కథను విని మనం నేర్చుకునేదేమిటంటే, పైపై మెరుగులు కొంతవరకే పనిచేస్తాయి అని! మనం చేపట్టిన పనిలో విఫలమవ్వడానికి కారణం అ పనిని ఎలా చేయాలో పూర్తిగా తెలియకపోవడమే, దానిని పూర్తిగా నేర్చుకోకపోవడమే! దానికి బదులుగా ఏదైనా ఒక విషయాన్ని లోతుగా నేర్చుకుని, అభ్యాసం చేసి, జీర్ణించుకుని, దానినే మన రెండవ స్వభావంగా మలచుకున్నప్పుడు, ఆ రంగంలో మనం పరిపూర్ణత సాధిస్తాము.

---

[1] **నీలిరంగు కుండలో పడిన నక్క కథ, పుష్పాంజలి : పేజీ 48**

## 2. మన వైఫల్యాలకు విరుగుడు

ప్రతి మనిషికీ కావలసినది ఏమిటి? తాను అనుకున్న పనిని సాధించి, దాని ద్వారా అంతులేని శాంతినీ, ఆనందాన్నీ సాధించడం! కొందరు డాక్టర్లు కావాలనుకుంటే కొందరు యాక్టర్లు కావాలనుకుంటారు. కొందరు ఇంజనీర్లు కావాలనుకుంటే కొందరు మేనేజర్లు కావాలనుకుంటారు. కొందరు పారిశ్రామికవేత్తలు కావాలనుకుంటే, కొందరు పారమార్థికవేత్తలు కావాలనుకుంటారు. అయితే, జీవితంలో కోరినదేదైనా, దాన్ని సాధించే పద్ధతిలో రహస్యం మాత్రం ఒకటే. అది ఏమిటంటే 'నేర్చుకునే విషయాన్ని పూర్తిగా నేర్చుకోవడమే' – అంటే దానిలో **కౌశలాన్ని సాధించడమే.**

అయితే, నిజజీవితంలో అధికశాతం మనుష్యులు ప్రవర్తించే తీరు అందుకు సరిగ్గా వ్యతిరేకంగా ఉంటుంది. విద్యార్థులు, ఉద్యోగులు – అందరూ కూడా – ఏ పనినైనా చేసేటప్పుడు దానిని పూర్తిగా నేర్చుకోవాలని అనుకోరు. ప్రస్తుతం ఎంతవరకూ అవసరమో అంతవరకే ముక్కున పెట్టుకుని, దానితోనే పని సాధిద్దామని అనుకుంటారు. ఇంతకంటే నేర్చుకోనవసరం లేదులే అని బద్ధకిస్తారు. ఇంకా ఎక్కువ నేర్చుకోవడం 'వృథా శ్రమ' అని ప్రకటిస్తారు! ఇక, జీవితమంతా అలాగే బ్రతికేసిన తోటివారు మనల్ని చూసి, "అదంతా చదువుతున్నావెందుకురా, దండగ!" అని కూడా అంటారు. కానీ ఇది మంచి పద్ధతి కాదు. ముక్కున పెట్టుకునో, గొంతులో పెట్టుకునో బయటకు కక్కితే బహుశా అది మనకు తాత్కాలికమైన విజయాన్ని తెచ్చిపెట్టవచ్చు కూడా. అయితే ఈ అంతంత మాత్రంగా నేర్చుకున్న విద్య

జీవితంలోని అన్ని సందర్భాలలోనూ సరిపోతుందా అన్నది ప్రశ్న. ఖచ్చితంగా సరిపోదు! నీలినక్కను చూశాము కదా!

ఏదైనా ఒక విషయాన్ని నేర్చుకున్నామని చెప్పిన తర్వాత అందులో మనకు తెలియనిదంటూ ఏమీ లేదన్నంత కూలంకషంగా దాన్ని నేర్చుకోవాలి. అలా నేర్చుకోవాలంటే, అభ్యాసం చేయాలి, పుస్తకాలు చదవాలి, ఇంటర్‌నెట్‌లో వెతకాలి, గురువులతో మాట్లాడాలి, ఆ విషయంలో పని చేసినవారితో మాట్లాడాలి – ఎన్ని రకాలు వీలైతే అన్ని రకాలుగా మనం ఆ విషయాన్ని గురించి పూర్తిగా తెలుసు కోవాలి. అయితే ఆచితూచి, అవసరమైనంత మాత్రమే చదివి, కొన్ని పరీక్షలలో నెగ్గుకు రాగానే విషయం మీద పూర్తి పట్టు సాధించినట్టు కాదు. నిజజీవితంలో పరిస్థితులు వేరుగా ఉంటాయి. నేర్చుకోవలసినది కూలంకషంగా నేర్చుకోని వాడికి, మారిపోతున్న పరిస్థితులలో, అనుక్షణం కొత్తగా పుట్టుకువచ్చే సమస్యలను ఎలా పరిష్కరించాలో అర్థం కాదు.

ముఖ్యంగా ఈ రోజుల్లో ఉన్నతవిద్య అభ్యసిస్తున్న యువత గురించి కొంత చెప్పుకోవాలి. ఇంజనీరింగ్ మాత్రమే కాక మిగిలిన విషయాలలో కూడా పట్టభద్రులవుతున్న యువతకు ఉద్యోగాలు దొరకడం లేదని వాపోతున్నారు. అయితే వారికి ఉద్యోగాలిచ్చే పారిశ్రామిక వేత్తలను పలకరిస్తే, “ఏమి చేయమంటారు? ఈ రోజుల్లో పట్టభద్రులవుతున్నారే కానీ వారికి ‘సబ్జెక్టు’ ఏమీ రాదు!” అని పెదవి విరుస్తున్నారు.

దీనికి బాధ్యత ఎవరిది? ప్రపంచంలో ‘మనకు’ ఏదైనా సమస్య ఎదురైతే దానికి పరిష్కారం ‘మన’ దగ్గరే ఉంటుం దన్నది మనం చక్కగా అర్థం చేసుకోవలసిన విషయం. ‘మన బంగారం మంచిది కాకపోతే కంసాలి ఏమి చేయగలడు!’

అని సామెత. కనుక ముందు మనల్ని మనమే సరిదిద్దుకో వాలి. పాఠశాలలకు, కళాశాలలకు మొక్కుబడిగా వెళ్ళి రావడంవల్ల మనకు, మన కుటుంబానికి, దేశానికీ ఏమీ ప్రయోజనం లేదు. ప్రముఖ విద్యావేత్తలను ప్రశ్నిస్తే వారు చెప్పే సమాధానం ఒకటే: 'మీరు చేపట్టిన ఏ విద్యలోనైనా సరే, మీకు తెలియనిది ఏదీ ఉండకూడదు. అప్పుడు మీ 'కెరీర్'కు ఢోకా ఉండదు!' కాబట్టి మన సమస్యలకు ఏకైక పరిష్కారం మనం చేపట్టిన విద్యలో, వృత్తిలో గొప్ప కౌశలాన్ని సాధించడమే.

## 3. సమరోత్సాహం కావాలి

సాధారణంగా మనలోని ప్రతిఒక్కరూ జీవితంలో ఎన్నో సాధించాలనుకుంటాము. అందుకోసం కొంత పనిచేస్తాము, కొంత సాధిస్తాము కూడా. ఏదోఒక విషయంలో మనం కోరినది జరగగానే పొంగిపోతాము. అయితే, జీవితంలో ఇలా మాటిమాటికీ అనుకున్నది జరగదు. ఎన్నింటిలో విజయాన్ని సాధిస్తామో, ఇంచుమించు అన్నే విషయాలలో మనకు ఓటమి కూడా ఎదురవుతుంది. ఒక విషయంలో విజయం సాధించాక కూడా, ఆ తర్వాత ప్రతి విషయం లోనూ మనం కోరినది చేయగలుగుతామా అంటే మనకు నమ్మకం ఉండదు.

కానీ నిజంగా ఘనత సాధించిన వారి విషయంలో అలా జరగదు. వారు ఒక దాని తర్వాత ఒక విషయంలో వరుసగా విజయాలు సాధిస్తూ ఉంటారు. అయితే, 'వారికి అపజయాలే ఎదురుకావా?' అని మీరు ప్రశ్నించవచ్చు. వారికి కూడా అపజయాలు ఎదురవుతాయి. అయితే, వారికి

ఆ అపజయాలు 'ఎద్దు కొమ్ము మీద వాలిన ఈగ' లాగా తోచి నట్టు మనకు కనిపిస్తుంది. వారు పనిచేసే పద్ధతిలో మనం ఎందుకు పనిచేయలేకపోతున్నామో అర్థం చేసుకోవాలి.

కార్యసాధకుడికి ఎటువంటి మనఃస్థితి ఉండాలో చెప్ప డానికి బందిపోటును ఉదాహరణగా చెపుతారు. బందిపోట్లు ఒక గ్రామం మీద దాడిచేస్తే ఎలా ఉంటుందో ఊహించండి! 'కొట్టు, చంపు! ఎవర్నీ వదలద్దు! అన్నీ దోచుకో!' అని అరుస్తూ బందిపోట్లు ఊరిమీద పడతారు. మనం కూడా ఏమి సాధించాలనుకున్నా ఆ బందిపోటులాంటి చొరవ, ఉత్సాహం, అంతుచూసే పట్టుదల ఉండాలి.

## 4. అరకొరగా పనిచేయకూడదు

గిన్నెను గోరువెచ్చగా ఉంచి వంట చేస్తే, గంటలు గడిచినా కూర ఉడకదు. తగినంత వేడితో పొయ్యి భగభగ మండాలి. అప్పుడే కూర చక్కగా ఉడికి, రుచిగా తినగలుగు తాము. అలాగే పని చేసేటప్పుడు, నేర్చుకునేటప్పుడు సగం సగం సాధన చేయకూడదు. చేస్తే ఎవరికి ఉపయోగం?

పూర్వం ఒక గురుకులంలో ఒక శిష్యుడు చేరాడు. గురువుగారు అతడికి ఆవరణలో గడ్డిపీకి, శుభ్రం చేయమని చెప్పాడు. శిష్యుడు విధేయతతో గడ్డి పీకడం మొదలు పెట్టాడు. అయితే గడ్డిని మొదళ్ళతోపాటు పీకకుండా పైపైనే ఆకులు మాత్రం తుంచి వేస్తున్నాడట. ఇది చూసి గురువు గారు, 'నాయనా! గడ్డిని వేళ్ళతో పాటు పీకాలి. పైపైనే తుంచివేస్తే ఆ గడ్డి మళ్ళీ పెరుగుతుంది కదా! ఇదే విషయం మన జీవితంలో కూడా వర్తిస్తుంది. మనలోని దురలవాట్లను పూర్తిగా నిర్మూలించాలి. నేర్చుకునే విషయాన్ని శ్రద్ధగా, పూర్తి

గా నేర్చుకోవాలి!' అని ఉద్బోధించాడు. అదే విధంగా, మనం పనిచేసేటప్పుడు తాడోపేడో తేల్చుకుంటాను అన్నట్టు పని చేయాలి; పూర్తి కౌశలం అబ్బేవరకూ దానిని వదలకూడదు.

శ్రీ వివేకానంద స్వామి (స్వామీజీ) ఇలా అన్నారు: "*ఒకే ఆలోచనను (పనిని, ఆదర్శాన్ని) చేపట్టండి. దానినే మీ జీవితంగా మలచుకోండి. దానినే తలపోయండి, దానినే కలగనండి, దాని మీదే జీవించండి. మీ మెదడు, కండరాలు, నరాలు, మీ దేహంలోని ప్రతి అణువణువునూ అదే ఆలోచనతో నిండిపోనివ్వండి. దాన్ని తప్ప మిగిలిన ప్రతిఒక్క ఆలోచనను విడిచి పెట్టండి. అసలైన విజయానికి దారి ఇదే! జీవితంలో పరిపూర్ణత సాధించాలంటే, ఇతరులకు కూడా పరిపూర్ణత కలిగేలా చేయాలంటే, మీరు మరింత లోతుగా పనిచేయాలి!*"

## 5. విజయానికి, కౌశలానికి తేడా

(Success vs. Mastery)

విజయానికి, కౌశలానికి తేడా ఏమిటో తెలియాలంటే, ముందుగా విజయం, అపజయం అనేవి ఏమిటో తెలుసు కోవాలి. విజయం కానీ, అపజయం కానీ ఇతరులతో పోల్చు కున్నప్పుడు మనకు కలిగేవి. ఇతరుల ప్రతిభ కన్నా ఎక్కువ ప్రతిభను మనం చూపగలిగితే చాలు – అది తాత్కాలికంగా నైనా సరే – మనకు విజయం కలిగినట్టే. అయితే అటువంటి విజయం వెనుకనే అపజయం ఉంటుంది. ఎందుకంటే, 'తాడిని తన్నేవాడుంటే, వాడి తలను తన్నేవాడు ఇంకొకడు ఉంటాడు' కదా! ఈ తాత్కాలికమైన జయాపజయాలు

మనల్ని ఒకసారి సంతోషంలో తేలిస్తే, మరొకసారి దుఃఖంలో ముంచుతాయి.

దేని మీద గెలుపు సాధిస్తే తక్కిన అన్నింటి మీద గెలుపు సాధించినట్లు? అసలు అటువంటి సంపూర్ణమైన విజయం అనేది ఒకటి ఉంటుందా? నిశ్చయంగా ఉంది. అది కేవలం ఒకసారి గెలవడంతోనే ఆగిపోదు. దానినే 'కౌశలం' అనీ, ఆంగ్లంలో 'మాస్టరీ' అనీ అంటారు.

కౌశలాన్ని సాధించినవాడు తనను ఇంకొకరితో పోల్చుకోడు. అతడి జయాపజయాలు ఇతరుల మీద ఆధార పడవు. పరిస్థితులు మారిపోతున్నా, ఎన్ని కష్టాలు ఎదురైనా, తోటివారు పొగుడుతున్నా, విమర్శిస్తున్నా అతడు ఒకే విధంగా పనిచేస్తూ, ముందుకు సాగుతూ ఉంటాడు. క్రమం గా అతడు జయాపజయాలను లెక్కచేయని స్థితికి, వాటికి అతీతమైన స్థితికి చేరుకుంటాడు కూడా. సుఖదుఃఖాల మధ్య ఊగిసలాటకు అతీతుడౌతాడు. అదే పరిపూర్ణత! ఈనాటి పోటీ ప్రపంచంలో ఇది చాలా ముఖ్యమైన విషయం. ఎన్ని డిగ్రీలు సంపాదించినా, ఎంత డబ్బు సంపాదించినా మన జీవితాలలో ఏదో తెలియని లోటు మిగిలిపోతూనే ఉంటుంది. అలా ఎందుకు జరుగుతుందో మనకు అర్థం కాదు. దానికి కారణం మనం రాత్రింబవళ్ళూ తాత్కాలికమైన విజయాల వెనుక పరుగు తీయడమే. జీవితమంతా ఇతరులతో పోటీపడుతూ, 'అందరికన్నా నేనే ముందుండాలి!' అని ఆలోచించడం క్రమంగా మనల్నే దిగజారుస్తుంది.

కౌశలాన్ని సాధించడానికి ప్రయత్నించకపోవడమే మనం చేసే పెద్ద పొరపాటు అని స్వామీజీ వివరించారు:

"సాధారణంగా, మనం కోరిన ఫలితాన్ని గురించిన ఆలోచనలో మనం లీనమైపోతాము. అదే మనం చేసే గొప్ప పొరపాటు. ఆ పొందబోతున్న ఫలితం మనల్ని మోహంలో ముంచెత్తుతుంది, దాని ఆకర్షణలో కట్టిపడేస్తుంది, మన మనస్సు ఎదుటి దృశ్యమంతా అదే నిండిపోతుంది - ఇక మనం దాన్ని సాధించడానికి ఏమి చేయాలన్న వివరాలన్నింటినీ మర్చిపోతాము." అదే మన అపజయాలకు కారణమని ఆయన వివరించారు. "...అయితే, మనం పరాజయం పాలైన ప్రతిసారీ, దానికి కారణమేమిటని లోతుగా విశ్లేషిస్తే, చేయవలసిన పని మీద సరిగా దృష్టి పెట్టకపోవడమే తొంభైతొమ్మిది శాతం ఆ అపజయానికి కారణమని మనకే అర్థమవుతుంది. ఒక ఫలితాన్ని సాధించడానికి ముందుగా దానిని సాధించడానికి అవసరమైన పద్ధతుల మీద, పని చేయడం మీద దృష్టిపెట్టాలి. పద్ధతుల్ని సరిగా పాటిస్తూ, చేయవలసిన పనిని సగంలో ఆపకుండా, బలంతోనూ, శ్రద్ధగానూ, పూర్తిగానూ చేయడమే మనకు కావలసినది."

కోరిన ఫలితాన్ని సాధించడానికి దేని మీద దృష్టి పెట్టాలో స్వామీజీ చక్కగా వివరించారు: "కారణమే ఫలితాన్ని ఇస్తుంది అన్న విషయాన్ని మనం మాటిమాటికీ మర్చిపోతూ ఉంటాము. ఫలితం దానంతట అదే రాజాలదు. తగిన, సరైన, బలమైన కారణం లేకపోతే అది రావడం అసంభవం. ఒకసారి మన లక్ష్యమేమిటో నిర్ణయించుకున్న తర్వాత, దాన్ని సాధించడానికి ఏమి పద్ధతులు అనుసరించాలో నిర్ణయించుకున్న తర్వాత, మనం ఆ లక్ష్యాన్ని మర్చిపోయినా ఫర్వాలేదు. ఎందుకంటే, మనం ఎన్నుకున్న పద్ధతిని చక్కగా

*అనుసరించి, శ్రద్ధగా పనిచేసినపుడు, ఫలితం వచ్చి తీరవల సిందే కదా! కారణం సరిగా ఉన్నప్పుడు, ఫలితం రావడంలో కష్టమేముంది? మనం పద్ధతుల పట్ల శ్రద్ధ తీసుకుంటే, ఫలితం దానంతట అదే వస్తుంది. కాబట్టి, పనిచేసే పద్ధతిని గురించి గొప్ప శ్రద్ధ తీసుకోవడమే జీవితంలోని రహస్యం. ...భగవద్గీతలో కూడా మనం ఇదే చదువుతాము. చేసే పని ఏదైనా సరే, మన శక్తివంచన లేకుండా పనిచేయాలనీ, వదలకుండా నిరంతరం పనిచేయాలనీ, మన మనస్సు మొత్తాన్నీ ఆ పని మీదే ఏకాగ్రం చేయాలనీ గీతలో శ్రీకృష్ణుడు చెప్పాడు. అదే సమయంలో, ...మనం చేస్తున్న పని నుంచి ఏదీ మన దృష్టిని మరలించకూడదు."* ఇదే విషయాన్ని భర్తృహరి నీతి శతకంలో చక్కగా వివరించాడు.

**తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత?**
**వెఱచిరే ఘోరకాకోల విషముచేత?**
**విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక?**
**నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు ॥ (ఏనుగు లక్ష్మణకవి)**

'అమృతం కోసం పాలసముద్రాన్ని దేవతలు, రాక్షసులు మథించారు. ఆ మథనంలో ముందుగా పుట్టిన మణులకే వారు సంతోషపడిపోలేదు. భయంకరమైన కాలకూటవిషం పుట్టినా భయపడిపోలేదు. అమృతం తయారయ్యే వరకూ తమ ప్రయత్నాన్ని మానుకోలేదు. నిపుణులైన బుద్ధిమంతులు ఆ విధంగా తాము సంకల్పించిన పని సక్రమంగా పూర్తయ్యే వరకూ వదిలిపెట్టరు.'

తాత్కాలికమైన విజయాల కోసం కాక కౌశలాన్ని సాధించిన కొందరు మహనీయుల కథల్ని ఇప్పుడు చూద్దాము.

## 6. కౌశలాన్ని సాధించిన కొందరు వ్యక్తులు

జీవితంలో తాము చేపట్టిన పని విషయంలో చక్కని కౌశలాన్ని, ఖ్యాతిని సంపాదించిన అనేకమంది మనకు కనిపిస్తూ ఉంటారు. వారు సాధించిన గొప్ప విజయాలను చూసి, వారు మనకంటే అంత గొప్పవారేమీ కాదనీ, మనకూ వారికున్నంత శక్తి ఉందనీ మనం అనుకుంటాము. కానీ అది నిజం కాదు. అటువంటి విజయాలు కేవలం రాత్రికి రాత్రే వచ్చిపడేవి కావు. ఎన్నో రోజులు కష్టించి సాధన చేసిన తర్వాతే వారు, తాము చేసే పనిని అన్ని సందర్భాలలోనూ ఒకే స్థాయిలో చేయగలిగిన స్థితికి చేరుకుంటారు. ఉదాహరణలుగా తమ కీర్తిని ఆచంద్రతారార్కం నిలబెట్టుకున్న కొందరు గొప్ప వ్యక్తుల గురించి తెలుసుకుందాము.

భారతరత్న ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి (1916-2004) కర్ణాటక సంగీతప్రపంచానికి చూడామణి. తన జీవితమంతా తాను చేపట్టిన విషయంలో కౌశలాన్ని సాధించడానికే ఆమె కృషి చేశారు. కర్ణాటక సంగీత ప్రపంచంలో ఆమె ఇతరుల కన్నా బాగా పాడుతున్నారన్నది నిజమే అయినా ఆమె లక్ష్యం అది కాదు. తాను చేసే పనిని మరింత చక్కగా చేయడమే ఆమె జీవితలక్ష్యం. ఆ విషయంలో ఆమె తనతో తానే పోటీ పడ్డారు. ఈనాడు ఆమె సాధించిన ఘనత గురించి చెప్పేటప్పుడు దానిని వేరొకరితో పోల్చి చెప్పవలసిన పని లేదు.

ఆచార్య కోడి రామ్మూర్తి నాయుడు (1882-1942) ఆంధ్రదేశానికి చెందిన గొప్ప మల్లయోధుడు.

వ్యాయామంతో పాటు, వాయుస్తంభన, జలస్తంభన అనే విద్యలలో ప్రావీణ్యాన్ని సాధించి, విశ్వవిఖ్యాతిని ఆర్జించాడు. ఇనుపగొలుసులను చేతులతో తెంచివేయడం, మోటారు వాహనాలను ఆపివేయడం, ఛాతీమీద ఏనుగులను నడిపించడం మొదలైన మానవాతీత సాహసాలను ప్రదర్శించి, ఐదవ జార్జి చేత 'కలియుగ భీముడు' అనే బిరుదును పొందాడు. ఒక సర్కసు కంపెనీని స్థాపించి, ప్రపంచమంతా ప్రదర్శనలిచ్చి, అపారమైన ధనాన్ని ఆర్జించాడు. అంతేకాక ఆ ధనంలో ఎక్కువ మొత్తాన్ని దానధర్మాలకూ, భారత స్వాతంత్ర్యోద్యమానికీ ధారపోశాడు.

భారతరత్న సి.వి.రామన్ (1888-1970) నోబెల్ బహుమతి పొందిన భౌతికశాస్త్రవేత్త. 'రామన్ ఎఫెక్ట్'ను కనుగొనడం ద్వారా విశ్వఖ్యాతిని ఆర్జించాడు. 1930వ సంవత్సరంలో నోబెల్ బహుమతిని ప్రకటించడానికి ముందుగానే స్వీడన్ దేశానికి టికెట్టు కొని ఉంచాడు. ఆయనకు తన నోబెల్ బహుమతి తనకు వస్తుందని ముందుగానే తెలుసు. తన విద్యలో కౌశలం ఉన్నవాడికి మాత్రమే అటువంటి ఆత్మవిశ్వాసం ఉండగలదు కదా!

యోగ గురువయిన బి.కె.ఎస్. అయ్యంగార్ (1918-2014) పేరు విననివారు ఉండరు. ఈనాడు ప్రపంచవ్యాప్తంగా యోగాసనాలు, ప్రాణాయామం గొప్ప ప్రాచుర్యాన్ని సంపాదించడానికి మూలకారకుడు బి.కె.ఎస్. అయ్యంగారేనని చెప్పడం అతిశయోక్తి కాదు. చిన్ననాడు తనకు కలిగిన అనారోగ్యాన్ని వదిలించుకోవడానికి యోగాసనాల సాధనను ప్రారంభించినా, తర్వాత వాటి ఉపయోగాన్ని ప్రపంచమంతా

తెలియజెయ్యాలన్న లక్ష్యంతో యోగాసనాలలోనూ, ప్రాణా యామంలోనూ గొప్ప కౌశలాన్ని సాధించి, ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ శిష్యులను తయారుచేయడమే కాక, తన శిష్యులు కూడా వారివారి జీవన రంగాలలో గొప్పస్థితిని సాధించడానికి తోడ్పడ్డాడు. ప్రపంచ ప్రఖ్యాత వాయులీన విద్వాంసుడు యెహుదీ మెనుహిన్‌లాంటి మహామహులతో సహా అసంఖ్యాకులైన శిష్యులను తయారు చేశాడు. 90వ పడిలో కూడా నవయువకుడిలా ఉపన్యాసాల ద్వారా, తరగతుల ద్వారా యోగపద్ధతులను ప్రచారం చేశాడు.

ఒక సంగీత విద్వాంసుణ్ణి ఒక విలేఖరి, 'కర్ణాటక సంగీతంలో మీరొక కొత్త ఒరవడిని సృష్టించడానికి ప్రయత్ని స్తున్నారా? అందులో మీరెంతవరకూ సఫలీకృతులయ్యారు?' అని ప్రశ్నించాడు. దానికి ఆ విద్వాంసుడు, 'అయ్యా! నేను పాడేటప్పుడు సంగీతంలోని అద్భుతాలను అనుభూతి చెందుతూ, తద్వారా ఎంతో ఆనందిస్తూ పాడతాను. అలా సంగీతంలోని అద్భుతాలను నేను ఆనందించలేకపోతే అసలు పాడడమే వృథా. అందుచేత నేను సఫలీకృతుణ్ణి అయ్యానా, లేదా అన్న ప్రశ్నే ఉదయించదు!' అని సమాధాన మిచ్చాడు. దీనిని బట్టి మనం నేర్చుకునేది ఏమిటంటే, మనకు కావలసినది కేవలం తాత్కాలికమైన విజయాలు సాధించడం కాక పరిపూర్ణతను సాధించడం.

వీరే కాక ప్రపంచంలో తమతమ వృత్తిప్రవృత్తులలో ఘనతను సాధించిన వారందరి జీవితాలలోనూ ఈ కౌశలమే కనిపిస్తుంది. మనం వారి జీవితకథలను శ్రద్ధగా పరిశీలించి, మనం కూడా వారిలాగా తయారవ్వడానికి ప్రయత్నించాలి.

## 7. కౌశలం యొక్క అవసరం

ఇక, ఈ కౌశలమనేది అవసరం లేదనే వాదన కూడా మనకు ఎదురు కావచ్చు. 'జీవితంలో ధనమే ముఖ్యం కదా! దాన్ని సంపాదించగలిగితే ఇక కౌశలం గురించిన దిగులెందుకు?' అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. డబ్బును లక్ష్యంగా చేసుకున్న మనిషి జీవితంలో ఎప్పటికీ ఆనందాన్ని పొందలేడు. ఎందుకంటే, ఎంత డబ్బుంటే సరిపోతుంది? అన్నది మొదటి ప్రశ్న. మరొకవైపు, సమాజపు ఆర్థిక స్థితిగతులు తల్లక్రిందులైతే, మనకున్న ధనానికి క్షణాలలో ఎటువంటి విలువ లేకుండా పోతుంది. కాబట్టి, మనం పోగు చేసిన ధనం మన గొప్పతనానికి, సామర్థ్యానికి ప్రమాణం కాజాలదు. నిజానికి, మన లక్ష్యాన్ని సాధించే మార్గంలో డబ్బు కొంతవరకూ తోడ్పడవచ్చు. అంతే! దానికి అంత కంటే ఎక్కువ విలువ ఇవ్వకూడదు. *"మనిషే ధనాన్ని తయారు చేస్తాడు కానీ, ధనం మనిషిని తయారుచేయగా మీరెక్కడైనా చూశారా?"* అని స్వామీజీ మనల్ని ప్రశ్నించారు. కాబట్టి, ధనం కంటే ఉన్నతమైనదేదో మనకు కావాలి. అదే పరిపూర్ణత. మనం చేసే పనిలో అత్యున్నతమైన కౌశలాన్ని సాధించడం ద్వారా మాత్రమే ఆ పరిపూర్ణత కలుగుతుంది.

*"మనం ఈ రోజున ఏ పరిస్థితిలో ఉన్నామో దానికి మనమే బాధ్యులం. ఇక మనం ఏమి కావాలని కోరుకుంటు న్నామో, అలా మనల్ని తయారు చేసుకోగలిగే శక్తి కూడా మనలోనే ఉంది. మనం ఈ రోజున ఎలా ఉన్నామో దానికి మనం ఇంతవరకూ చేస్తున్న పనులే కారణమైనప్పుడు, మనం ప్రస్తుతం చేస్తున్న పనుల ద్వారా మన భవిష్యత్తును*

*తీర్చిదిద్దుకోవచ్చునని అర్థమవుతోంది కదా! కాబట్టి మనం ఎలా పనిచేయాలో తెలుసుకోవాలి!"* అని స్వామీజీ చెప్పారు. గొప్పతనాన్ని సాధించిన వారందరూ ఈ విషయాన్ని చక్కగా తెలుసుకున్నవారు కనుకనే వారి జీవితాలను వారే గొప్పవిగా తీర్చిదిద్దుకున్నారు. ఇదంతా చదివిన తర్వాత జీవిత లక్ష్యాన్ని చేరుకోవడానికి ప్రయాణించే మార్గాన్ని మూడు మెట్లుగా చెప్పుకోవచ్చు. ఈ మూడు మెట్లను మనం చక్కగా ఎక్క గలిగితే, వాటికి పైన ఉన్న మన లక్ష్యాన్ని మరచిపోయినా సరే, అదే మనల్ని వెతుక్కుంటూ వస్తుంది.

**1. జీవితంలో ఏ లక్ష్యాన్ని, ఆదర్శాన్ని సాధించాలనుకుంటున్నామో దృఢంగా నిశ్చయించుకోవడం,**

**2. దాన్ని సాధించడానికి అవసరమైన పద్ధతులను నిర్ణయించుకోవడం,**

**3. ఎంచుకున్న పద్ధతులతో సర్వశక్తులూ ఒడ్డి పనిచేయడం, వేరే పనులన్నింటినీ వదిలిపెట్టడం.**

ముందటి అధ్యాయంలో ఉదహరించిన వారే కాక, మన పురాణాలలో గొప్ప కౌశలాన్ని సాధించిన వ్యక్తులు అనేకులు కనిపిస్తారు. వారిని గురించి అధ్యయనం చేసి, వారిని అనుసరించి మన ప్రవర్తనను మెరుగుపరచుకున్నప్పుడు మనం కూడా వారిలాగా పరిపూర్ణత సాధించగలుగుతామని స్వామీజీ మనకు సలహా ఇచ్చారు. మహాభారతంలో కనిపించే అర్జునుడు ఘనతర కౌశలాన్ని సాధించిన వ్యక్తికి అత్యుత్తమ ఉదాహరణ. సాధారణమైన మానవుడిలాగా చెమటోడ్చి, తన స్వశక్తితో పరిపూర్ణతను సాధించిన అర్జునుడి కథను తెలుసుకుందాము.

---

## 8. మహాభారతానికి పరిచయం

"తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి!" అని సామెత. నాలుగు వేదాల తర్వాత, 'పంచమవేదం' అని పేరు తెచ్చుకున్న ఈ మహాభారతం అతి ప్రాచీన కాలపు పురాణం. అయినా, ఈనాటికీ దాని కథను ఎవరైనా చెప్పడం మొదలు పెట్టగానే మన మనస్సు సంతోషంతో గంతులు వేస్తుంది. ఇంకాయింకా వినాలని అనిపిస్తుంది. మహాభారతం మనకు నేర్పించగలిగే పాఠాలు అనేకం. అంతేకాక వాటిని వ్యాసుడు కథగా చెప్పిన తీరు ప్రపంచం మొత్తాన్ని వేల సంవత్సరాలుగా ముగ్ధుల్ని చేస్తోంది. శీలనిర్మాణానికి తగిన విద్యాబోధన చేసేదే మహాభారతం. దానిని ఇప్పటికే చదువక పోతే ఇప్పుడు తప్పక చదవాలి. ఒకసారి ఆ మహాగ్రంథాన్ని చదివితే, 'ఇన్నాళ్ళుగా దీన్ని ఎందుకు చదవలేదబ్బా!' అని మనల్ని మనమే మందలించుకోవడం తథ్యం. మహాభారత కథ అటువంటిది. అంతేకాక, విశ్వవిఖ్యాతమైన భగవద్గీత మహాభారతంలో అంతర్భాగం.

***మహాభారతం భరత వంశం కథ. ఆ వంశపు రాజులలో శంతనుడు ఒక గొప్పరాజు. శంతనుడు గంగాదేవిని వివాహం చేసుకున్నాడు. వారి కుమారుడే భీష్ముడు.[2] భీష్ముడి జననం తర్వాత గంగాదేవి వెళ్ళిపోయింది. భీష్ముడు యువకుడై అన్ని శస్త్రాస్త్రవిద్యలలో ఆరితేరాడు. కొంతకాలం తర్వాత, ఒకనాడు శంతనుడు సత్యవతి అనే కన్యను చూసి మోహించాడు. వారి వివాహానికి ఆమె తండ్రి అంగీకరించలేదు. అతణ్ణి ఒప్పించడానికి భీష్ముడే వెళ్ళాడు. అయితే భీష్ముడిలాంటి కొడుకు ఉండగా తన కూతురుకు పుట్టిన బిడ్డలు రాజులు కావడం సాధ్యం కాదు కాబట్టి, తాను ఆ వివాహానికి ఒప్పుకోవడం లేదని సత్యవతి తండ్రి తెగేసి చెప్పాడు. దానితో భీష్ముడు,***

[2] (భీష్ముడు, 'మన మహోన్నతవారసత్వం' : పేజీ 104).

ఆమెకు పుట్టే కుమారులనే రాజులుగా చేస్తాననీ, తాను వివాహం చేసుకోననీ భీషణమైన ప్రతిజ్ఞ చేసి, ఆమెతో తన తండ్రికి వివాహం జరిపించాడు. సత్యవతికి శంతనుడివల్ల ఇద్దరు కొడుకులు కలిగారు. వారికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అని పేర్లు పెట్టారు. వారికి యౌవనం రాకుండానే శంతనుడు కన్నుమూశాడు. అందువలన ఆ పిల్లలకు విద్యాభ్యాసం చేయించడంతో పాటు, వారి తరఫున భీష్ముడే రాజ్యపాలన నిర్వర్తించవలసి వచ్చింది.

ఇక చిత్రాంగదుడు ముందే చనిపోగా, విచిత్రవీర్యుడికి భీష్ముడు అంబిక, అంబాలిక అనే రాకుమార్తెలతో వివాహం చేశాడు. అయితే, విచిత్రవీర్యుడు కూడా బిడ్డలు లేకుండానే అకాలమరణం పాలయ్యాడు. వంశం ఆగిపోకుండా ఉండడం కోసం, సత్యవతి కోరిక మేరకు ఆమె పెద్ద కొడుకైన వ్యాసుడి ద్వారా అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు కలిగారు. వారిరువురూ మహాబలసంపన్నులే అయినా వారిలో ధృతరాష్ట్రుడు గుడ్డివాడుగానూ, పాండురాజు పాండురోగిగానూ తయారయ్యారు. సింహాసనం ఆశించని భీష్ముడు మరొకసారి తన పుత్రులు కాని వారికి విద్య నేర్పి, వారిని రాజులుగా తయారుచేయడంలోనూ, తాను పాలించని రాజ్యాన్ని సంరక్షించడంలోనూ నిమగ్నమయ్యాడు.

పాండురాజుకు ఇద్దరు భార్యలు - కుంతి, మాద్రి. వారిలో కుంతికి ముగ్గురు, మాద్రికి ఇద్దరు కొడుకులు కలిగారు. ఈ ఐదుగురికే పాండవులని పేరు. వీరు యుధిష్ఠిరుడు (ధర్మరాజు), భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు. శ్రీకృష్ణుడి తండ్రి అయిన వసుదేవుడు కుంతికి సోదరుడు. తన మేనత్త బిడ్డలైన పాండవులను శ్రీకృష్ణుడు చిన్ననాటి నుంచీ అభిమానించేవాడు. వారి ప్రతిభాపాటవాలను, నీతినిజాయితీలను, పరాక్రమాలను చక్కగా ఎరిగినవాడు కృష్ణుడే అనడంలో ఏమీ సందేహం లేదు. ఇక, బాల్యంలోనే ఎంతోమంది రాక్షసులను చంపిన శ్రీకృష్ణుడు ఒక అసాధారణ వ్యక్తి అని పాండవులకు కూడా తెలుసు.

ధృతరాష్ట్రుడికి గాంధారి ద్వారా నూరుమంది కొడుకులు కలిగారు. వారికే కౌరవులని పేరు. కౌరవులలో దుర్యోధనుడు పెద్దవాడు.

*దుశ్శాసనుడు రెండవవాడు. దాయాదులైన కౌరవ, పాండవుల మధ్య వైరం చిన్ననాడే మొదలైంది.*

మహాభారతం ధీరుల చరిత్ర. ఇందులో మనకు వందలకొద్దీ పాత్రలు కనిపిస్తాయి. ఒక్కొక్కరు ఒక్కొక్క రకపు వ్యక్తిత్వానికి ప్రతీక. ఇందులో ఎటువంటి వ్యక్తిత్వాలు కనిపిస్తాయో, అవే ఈనాటికీ మనకు ప్రపంచంలో కనిపిస్తూ ఉంటాయి. 'ప్రపంచంలోని విషయాలన్నీ మహాభారతంలో ఉన్నాయి కానీ, మహాభారతంలో లేని విషయాలు ప్రపంచం లో లేవు!' అని నానుడి. ఈ మహాభారతంలో కనిపించే సత్యవ్రతం, దృఢనిశ్చయం, బలం, పౌరుషం, మేధస్సు మనం నేర్చుకోవలసిన విషయాలు. జీవితంలో ఏమాత్రం రాజీపడకుండా జీవించిన వ్యక్తులను మనం ఇక్కడ చూడవచ్చు. మహాభారతాన్ని చదవడం ద్వారా జీవితంలో ఎలా మసలుకోవాలో, ఎలా పరిపూర్ణతను సాధించాలో మనకు అర్థమవడమే కాక ఎలా వ్యవహరించకూడదో, ఎలా జీవించకూడదో కూడా అర్థమవుతుంది.

## 9. అర్జునుడు

మహాభారతానికి ముఖ్యుడు అర్జునుడు. అర్జునుడి జీవితంలో మనం నేర్చుకోదగిన విషయాలెన్నో కనిపిస్తాయి. నిజానికి, మహాభారతంలోని అన్ని పాత్రలూ మనకు ఏదోవొకటి నేర్పేవే. అయితే వారందరిలోకీ అర్జునుడే గొప్పవాడు. 'పాండవానాం ధనంజయః –పాండవులలో నేను అర్జునుణ్ణి!' (గీత 10:37) అని శ్రీకృష్ణుడే చెప్పాడు కదా! శ్రీకృష్ణుడు భగవంతుడికి ప్రతిరూపమైతే, అర్జునుడు మానవుడికి ప్రతిరూపం. ఒక మానవుడు ఎలా గొప్పవాడు కాగలడో మనం అర్జునుణ్ణి చూసి నేర్చుకోవాలి.

అర్జునుడు తన జీవితంలో సాధించిన పనులను జాగ్రత్తగా అధ్యయనం చేస్తే అతడు వాటన్నింటినీ తన స్వశక్తితో, అలుపెరుగని పరిశ్రమతో సాధించినట్టు మనకు తెలుస్తుంది. జీవితంలో ఎదురైన సమస్యలను పరిష్కరించడానికి ఎప్పటి కప్పుడు కొత్త విషయాలను నేర్చుకుంటూ, మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా తనను తాను మార్చుకుంటూ, అన్నింటా విజయాన్ని సాధించాడు. మనం ఊహించలేనన్ని కష్టాలను అతడు చిన్నతనంలోనే అనుభవించాడు. ద్రోణుడి శిష్యరికం ద్వారా విలువిద్యలో తిరుగులేనివాడని పేరు తెచ్చుకున్నాడు. అమితమైన సాధనతో విద్యాభ్యాసం చేశాడు. మరొకవైపు దాయాదులు చేసిన హత్యాప్రయత్నాల వల్ల, తమ రాజ్యాన్ని మోసంతో లాగుకోవడంవల్ల, మిగిలిన సోదరులతో కలసి అడవులు పట్టి తిరిగాడు. ఆ కష్టకాలంలో కూడా గుండెనిబ్బరంతో, విలువిద్యలో మరింత నైపుణ్యాన్ని పెంచుకోవడానికి కృషి చేశాడు. చివరికి, కురుక్షేత్ర సంగ్రామంలో ఘనవిజయాన్ని సాధించాడు.

అర్జునుడి ఘనకార్యాలను గమనిస్తే, వాటిని అతడు ఎలా సాధించాడో తెలుసుకోవాలనిపిస్తుంది. అతడి విజయ రహస్యం ఏమిటో మనకు కూడా తెలిస్తే ఎంత బాగుంటుందో కదా! అది తెలియాలంటే అర్జునుడి జీవిత విశేషాలను అధ్యయనం చేసి, జీవితంలో ఎదురైన ఒక్కొక్క పరిస్థితిని అతడు ఎలా ఎదుర్కొన్నాడో పరిశీలించాలి.

## 10. పాండవ, కౌరవుల బాల్యం

***పాండురాజు అకాలమరణంతో, పాండవులు తమ తల్లి కుంతీదేవితో పాటు ధృతరాష్ట్రుని వద్దనే జీవించసాగారు. వారికి కృపాచార్యుడు విద్య నేర్పసాగాడు. పాండవులు మహాబలశాలులై, అన్ని విద్యలలోనూ రాణించ***

*సాగారు. ఇది చూసి దుర్యోధనాదులు ఓర్వలేకపోయేవారు. క్రమంగా ఇది వారి పట్ల ద్వేషంగా మారింది. పాండవకౌరవులు ఒకనాడు ఆడుకుంటూ ఉండగా వారి బంతి ఒక బావిలో పడింది. దానిని ఎలా బయటకు తీయాలో అర్థంకాక వారు తికమకపడుతూ ఉంటే, ద్రోణుడు వచ్చి, గడ్డిపోచలనే బాణాలుగా ఉపయోగించి, ఆ బంతిని బయటకు తీశాడు. ఇది చూసి ఆ రాకుమారులు ఎంతో ఆశ్చర్యపోయి, ఎవరో గొప్ప విలుకాడు వచ్చాడని పరుగుపరుగున పోయి భీష్మడితో చెప్పారు. భీష్ముడు ద్రోణుణ్ణి మర్యాదగా ఆహ్వానించి, కురువంశస్థులైన తన మనవళ్ళను (పాండవులను, కౌరవులను) శిష్యులుగా స్వీకరించమని అభ్యర్థించాడు. చక్కని సామగ్రి కలిగి, ధనధాన్యాలతో నిండిన మంచి ఇంటిని ఇచ్చి ద్రోణుణ్ణి ఆనందపరిచాడు.*

## 11. 'నేను సాధించగలను!'

*విద్యాభ్యాసం ప్రారంభించేనాడు ద్రోణుడు శిష్యులతో ఇలా అన్నాడు. 'నా మనస్సులో ఒక కోరిక ఉన్నది. గురుదక్షిణగా ఆ కోరికను మీరు తీర్చాలి. మీ విద్యాభ్యాసం ముగిసి, మీరు అస్త్రవిద్యలో మంచి కౌశలం సంపాదించిన తర్వాతే ఆ పని చేయవచ్చు. ఏమంటారు?' అన్నాడు. ఆ మాట విని కౌరవులందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. అయితే అర్జునుడు, 'మీరు ఏది కోరితే అది నెరవేరుస్తాను!" అని ప్రతిజ్ఞ చేశాడు. అది చూసి ద్రోణుడు చాలా సంతోషించాడు.*

కొంచెం ఆలోచిస్తే, అర్జునుడు కాకుండా మిగిలిన వాళ్ళు ఎలా ప్రవర్తించారో మనం కూడా అలాగే ప్రవర్తిస్తూ ఉంటామని గమనించవచ్చు. అర్జునుడు ఎలా ఆత్మవిశ్వాసంతో 'నేను చేయగలను!' అని చెప్పాడో మనం కూడా అలా అనడానికి సాహసించాలి. ఆ సాహసమే లేకపోతే ఇక మన పౌరుషత్వానికి ఋజువు ఏమిటి? ఆత్మవిశ్వాసం గురించి చెపుతూ స్వామీజీ మనల్ని ఇలా మందలించారు: "'ఇంగ్లండులో ఎవరైనా బాలుడు, 'నేను ఆంగ్లేయుణ్ణి! నేనేమైనా సాధించ

*గలను!' అని జవాబిస్తాడు. అమెరికాలో పిల్లవాడు కానీ, ఐరోపాలో పిల్లవాడు కానీ అలాగే చెప్పగలడు. అదే మన దేశంలో బాలురు అలా చెప్పగలరా? ఆ బాలుడు కాదు గదా వాడి తండ్రి కూడా అలా ధైర్యంగా చెప్పలేడు. మన మీద మనకే విశ్వాసం పోయింది! ...అలా చెప్పగలిగే ఆత్మ విశ్వాసం మనకు కావాలి!" ఇటువంటి లక్షణాలు కలిగిన మహాపురుషులు మన దేశంలోనే పూర్వం పుట్టారు. అయితే, మనం వారిని మర్చిపోయాము."*



*"ప్రపంచ చరిత్ర అంటే ఏమిటి? ఆత్మవిశ్వాసం కలిగిన కొద్దిమంది వ్యక్తుల చరిత్రనే మనం ప్రపంచ చరిత్ర అంటున్నాము. ఆ ఆత్మవిశ్వాసం మనలోని దివ్యత్వాన్ని వెలికి తీస్తుంది. మీరు ఏమైనా చేయగలరు. మీలో ఉన్న అనంతమైన శక్తిని వెలికితీసి, పనిలో పెట్టడానికి మీరు తగినంత ప్రయత్నం చేయనందువల్లనే మీరు విఫలమవుతున్నారు. ఎప్పుడైతే ఒక మనిషి కానీ, ఒక దేశం కానీ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోతాయో అప్పుడు ఆ మనిషికి, ఆ*

*దేశానికి మరణం దగ్గరపడినట్లే!"* అని స్వామీజీ చెప్పారు. అందుచేత మనం కూడా, 'నేను సాధించగలను!' అనుకోవాలి. అదే మాటను ధైర్యంగా పలకాలి. ఓటమిని ఊహించుకొని భయపడిపోకూడదు. ఓటములు కూడా గెలుపు మేడకు మెట్లేనని గ్రహించాలి.

## 12. కొత్త విషయాలను అన్వేషించాలి

తాను చెప్పిన దానిని నేర్చుకోవడంతోనే శిష్యుడు ఆగిపోతే గురువుకు సంతోషం కలుగదు. గురువు బోధించిన దానికి తన తెలివితేటలు జోడించి, అందులో నుంచి కొత్త విషయా లను నేర్చుకోగలిగినప్పుడే గురువు నిజంగా ఆనందిస్తాడు.

***ఒక రాత్రి అర్జునుడు భోజనం చేస్తున్న సమయంలో గాలి జోరుగా వీచి దీపం ఆరిపోయింది. పూర్వకాలం చీకటిలో భోజనం చేయవద్దని చెప్పేవారు. ఎందుకంటే తినే దానిలో ఏమన్నా పడితే కనపడదని బహుశా పెద్దల ఉద్దేశ్యం. కానీ అర్జునుడు భోజనం చేయడం ఆపలేదు. చీకటిలో కూడా తన విస్తరిలోని ఆహారపదార్థాలు ఎక్కడెక్కడ ఉన్నాయో ఊహించి తినసాగాడు. అలా చీకటిలో తాను భోజనం చేయగలిగినప్పుడు, చీకటిలో బాణాలు కూడా వేయవచ్చు కదా అతడికి తోచింది. ఆ రోజు నుండి అర్జునుడు రాత్రి సమయంలో సైతం తన సాధనను కొనసాగించాడు. నిశ్శబ్దమైన రాత్రివేళ, అర్జునుడి అల్లెత్రాటి ఠంకారధ్వనిని విని నిద్రపోతున్న ద్రోణుడు లేచి వచ్చి చూశాడు. అలా ఒక కొత్త ఆలోచనతో రాత్రిపూట కూడా విడువకుండా అతడు సాధన చేస్తున్నందుకు ఎంతో సంతోషించాడు. అతణ్ణి కౌగలించుకుని, 'విలువిద్యలో లోకంలో నీకు సమానమైనవారు మరెవ్వరూ లేనట్లుగా నిన్ను తీర్చిదిద్దుతాను!' అన్నాడు.***

చాలాసార్లు జీవితంలో మనం విజయం సాధించకపోవ డానికి కారణం, కొత్త విషయాలను నేర్చుకోవడానికీ, కొత్త ప్రయోగాలు చేయడానికీ తగినంత ఉత్సాహాన్ని చూపకపోవ డమే. గొప్పవారు సగటు మనుష్యులకన్నా భిన్నంగా

పనిచేశారు కనుకనే వారు గొప్పవారయారు. ప్రపంచంలో అందరూ ఎలా ఉన్నారో, ఎలా పనిచేస్తున్నారో అదే విధంగా, అదే స్థాయిలో మనం కూడా పనిచేస్తే మనం కూడా వారిలాగానే మిగిలిపోతాము. గొప్పతనం సాధించాలంటే సాహసంతో కొత్త పద్ధతులు పాటించడానికీ, కొత్త పుంతలు తొక్కడానికీ వెరువకూడదు. సాధారణంగా మనం, 'ఏదైనా కొత్తగా చేస్తే, అది సరిగా కుదరకపోతే, అందరూ నవ్వుతారేమో! దానికంటే చేయకుండా ఉండడమే నయం!!' అని అనుకుంటాము. అలా చేసి విఫలమైనప్పుడు వచ్చిపడబోయే 'మహామహా' పరాభవాలను, అవమానాలను ఊహించుకుని, అనుకున్న పనిని ముందే మానివేస్తాము. అయితే, ఇలా భయపడేవాడు జీవితంలో ఏదీ సాధించలేడు. "నాలుగుసార్లు *నవ్వులపాలయినంత మాత్రాన పోయేదేముంది? ...పొరపాట్లు* చేసినా ఫర్వాలేదు కానీ ఎల్లప్పుడూ కొత్తకొత్త ఆలోచనలను, కొత్తకొత్త పనులను చేయడానికి వెనుకాడ *వద్దు!*" అని స్వామీజీ మనకు సలహా ఇచ్చారు. ఈ విషయం లో మనకున్న బిడియాన్ని, పిరికితనాన్ని, సోమరితనాన్ని వదిలించుకుంటే విజయం దానంతటదే మనదౌతుంది.

***పాండవులు, కౌరవులు ద్రోణాచార్యుని దగ్గర శిష్యులుగా సకల విద్యలూ అభ్యసించారు. ధర్మరాజు రథం మీద నిలబడి యుద్ధం చేయడంలోనూ, భీముడూ, దుర్యోధనుడూ గదాయుద్ధంలోనూ, నకుల సహదేవులు కత్తిసాములోనూ నిపుణులయ్యారు. బుద్ధి, ఏకాగ్రత, బలం, ఉత్సాహం అమితంగా గల అర్జునుడు సకల విద్యలతోపాటు, విలువిద్యలో ఆరితేరాడు. అంతేకాక, రెండు చేతులతోనూ ఒకే సామర్థ్యంతో బాణాలు వేయగల గొప్ప నైపుణ్యం సాధించాడు. గురువు పట్ల ప్రేమ, విధేయత మొదలైన సుగుణా లలో అందరికన్నా మిన్న అయ్యాడు. ద్రోణాచార్యుడు శిష్యులందరిపట్ల***

*సమానమైన ప్రేమను, వాత్సల్యాన్ని ప్రదర్శిస్తూ అందరికీ విద్యను సమానంగా బోధించాడు. అయినా అర్జునుడు తన సొంత ప్రతిభవల్ల, కృషివల్ల, రాజకుమారులందరినీ మించిపోయాడు.*

ఆచార్యాత్ పాదమాదత్తే పాదం శిష్యః స్వమేధయా ।
పాదం స బ్రహ్మచారిభ్యః పాదం కాలక్రమేణ చ ॥

విద్యార్థి ఎలా నేర్చుకుంటాడో తెలిపే శ్లోకం ఇది. 'నాలుగు వంతులలో గురువు నేర్పేది ఒక వంతు అయితే అభ్యాసంతో, మేధస్సుతో నేర్వవలసినది ఒక వంతు. తోటి విద్యార్థుల సాహచర్యం, చర్చల ద్వారా మూడవ వంతు విద్య అలవడితే,





కాలక్రమంలో మన అవగాహన పెరగడం ద్వారా నాలుగవ వంతు విద్య అబ్బుతుంది’ అని ఈ శ్లోకానికి అర్థం. అయితే, దీనిలో చెప్పిన నాలుగు భాగాలూ సమానంగా ఉండనవసరం లేదు. విద్యార్థి శక్తిని బట్టి అవి మారవచ్చు.

## 13. అర్జునుడు చూపిన గొప్ప శక్తి - ఏకాగ్రత

*ధనుర్విద్యలోనూ, శస్త్రాస్త్రప్రయోగంలోనూ శిక్షణ పొందుతున్న రాకుమారులను పరీక్షించాలని ద్రోణుడు అనుకున్నాడు. అందుకోసం శిల్పులచేత కొయ్యతో ఒక పక్షి బొమ్మ చేయించి, దానిని చెట్టుకొమ్మ మీద పెట్టించి, అదే వారి లక్ష్యమని చూపించాడు. ఆపైన శిష్యులతో, “మీరందరూ ధనుస్సులను తీసుకుని, ఆ పక్షికి గురిచేసి బాణాలను ఎక్కుపెట్టి నిలబడండి.*

*నేను చెప్పిన వెంటనే ఆ పక్షి తలను పడగొట్టాలి. ఒకొక్కరినే నేను విడివిడిగా ఆదేశిస్తాను" అన్నాడు. ద్రోణుడు ముందుగా ధర్మరాజుతో, 'రాజకుమారా! చెట్టుమీద ఉన్న ఆ పక్షిని చూస్తున్నావా?' అని అడిగాడు. ధర్మరాజు చూస్తున్నానన్నాడు. 'నీకు ఏమేమి కనపడుతున్నాయి' అని ద్రోణుడు ధర్మరాజును అడిగాడు. పక్షితో పాటు చెట్టు, తన సోదరులు కూడా కనపడుతున్నారని ధర్మరాజు సమాధానం చెప్పాడు. ఇది విని ద్రోణుడు చిరాకుపడుతూ, "తప్పకో! ఈ లక్ష్యాన్ని నీవు కొట్టలేవు!" అని అన్నాడు. తర్వాత దుర్యోధనుడు, భీముడు మొదలైన శిష్యులందరినీ అదే విధంగా ద్రోణుడు అడిగాడు. ధర్మరాజులాగానే వాళ్ళు కూడా తమకు అన్నీ కనబడుతున్నాయని చెప్పారు. ద్రోణుడు వారిని కూడా ప్రక్కకు తప్పుకోమన్నాడు.*

*తరువాత ద్రోణుడు అర్జునుడితో, "ఇప్పుడు నీవు దానిని భేదించాలి. లక్ష్యానికి గురి పెట్టు. నేను చెప్పినప్పుడు నీవు బాణాన్ని వదలాలి. విల్లులో బాణాన్ని సంధించు!" అన్నాడు. ద్రోణుడు ఇలా చెప్పగానే అర్జునుడు బాణాన్ని సంధించి, వింటినారిని చెవిదాకా లాగి గురిపెట్టి నిలబడ్డాడు. ద్రోణుడు మిగతా శిష్యులను అడిగినట్టే అర్జునుణ్ణి కూడా, "ఆ పక్షినీ, నన్నూ, చెట్టును కూడా చూస్తున్నావా?" అని అడిగాడు. "పక్షిని మాత్రమే చూస్తున్నా, చెట్టును కానీ, తమరిని కానీ చూడటం లేదు!" అని అర్జునుడు ద్రోణుడితో అన్నాడు. దానితో ద్రోణుడు సంతోషించి, "పక్షిని మాత్రమే చూస్తున్నట్లయితే దాని శరీరమెలా ఉన్నదో చెప్పు?" అని అడిగాడు. అర్జునుడు, "పక్షి తలను మాత్రమే చూస్తున్నాను. శరీరం కనిపించడం లేదు!" అని సమాధానం చెప్పాడు. ఆ మాటలకు పులకించిపోయిన ద్రోణుడు, "బాణాన్ని వదులు!" అని ఆదేశించాడు. మరుక్షణం అర్జునుడు బాణం వేసి, కొయ్యపక్షి తలను నేలకూల్చాడు. ద్రోణుడు అర్జునుణ్ణి కౌగలించుకుని ఆశీర్వదించాడు.*

అర్జునుడు పక్షి తలను కొట్టడంలో ఏకాగ్రత అనే శక్తిని ప్రదర్శించాడు. అర్జునుడు సాధించిన ఏకాగ్రతను మనం కూడా నేర్చుకోవచ్చు. జీవితంలో కోరినది సాధించాలంటే,

ఏకాగ్రత అంటే ఏమిటో తెలుసుకోవడం, దానిని పెంపొందించుకోవడం ఎంతైనా అవసరం.

### 14. ఏకాగ్రత - ఏమిటి? ఎందుకు?

అర్జునుడు తన దృష్టిని పూర్తిగా చేస్తున్న పని మీదే కేంద్రీకరించాడు. అలా మనస్సు ఒకే విషయాన్ని గురించి నిలకడగా ఆలోచించడమే ఏకాగ్రత. భూతద్దం ద్వారా సూర్య రశ్మి కేంద్రీకృతమైనప్పుడు అది చెక్కను క్షణాలలో కాల్చ గలుగుతుంది. కానీ నేరుగా తాకే సూర్యరశ్మి ఆ చెక్కను కాల్చ లేదు. అదే విధంగా సాధారణమైన స్థితిలో మన ఆలోచనాశక్తి చెల్లాచెదరై ఉంటుంది. ఆ స్థితిలో మనస్సు విషయాలను త్వరగా నేర్చుకోలేదు. అయితే, అదే ఆలోచనాశక్తిని మనం ఏకాగ్రం (కేంద్రీకృతం) చేసినప్పుడు, అంటే ఒకే విషయం మీద నిలిపినప్పుడు, అది అతి త్వరగా నేర్చుకోగలుగుతుంది.

ఈ ఏకాగ్రత అనేది మనిషి జీవితంలో అతి ముఖ్యమైన విషయమే కాక ప్రతివొక్కరికీ అది తప్పనిసరి. *"మనుష్యు లకూ, జంతువులకూ ప్రధానమైన తేడా వారి ఏకాగ్రతా శక్తిలోని తేడాయే. ..అదే విధంగా మనిషికీ, మనిషికీ ఉన్న తేడా కూడా వారి ఏకాగ్రతలలో తేడాయే. ఒక అల్పుణ్ణీ, ఒక ఉన్నత వ్యక్తిని పోలిస్తే, వారి ఏకాగ్రతలలో తేడాయే వారి మధ్య నిజమైన తేడా! ఏ రంగంలో విజయం సాధించాలన్నా అది ఏకాగ్రత వల్లనే సాధ్యమవుతుంది"* అని స్వామీజీ చెప్పారు. అర్జునుడికీ, మిగిలినవారికీ ఉన్న తేడా ఇందులోనే.

*"ఈ ఏకాగ్రతాశక్తి ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువ జ్ఞానాన్ని మనం సంపాదిస్తాము. ఎందుకంటే జ్ఞానాన్ని సంపాదించే పద్ధతి ఏకాగ్రత మాత్రమే.* మనం సాధారణమైన

*దనుకునే బూటు పాలిష్ పనిలో కూడా ఎంత ఏకాగ్రతను చూపిస్తే, అంత చక్కగా బూట్లను పాలిష్ చేయగలుగుతాము. ఎక్కువ ఏకాగ్రతతో వంటచేసేవాడు మరింత చక్కగా వంట చేయగలుగుతాడు. డబ్బు సంపాదించడంలో కానీ, దేవుణ్ణి అర్చించడంలో కానీ, ఏ పనిలోనైనా సరే, మన ఏకాగ్రతాశక్తి ఎంత బలంగా ఉంటే, ఆ పని అంత బాగా జరుగుతుంది"* అని స్వామీజీ ఏకాగ్రత ఉపయోగమేమిటో వివరించారు.

ఏకాగ్రత మనస్సుకు సంబంధించినదే కానీ, ఫలానా విద్యకు సంబంధించినది కాదు. ఒకసారి మన మనస్సు ఒక విషయంలో, ఒక విద్యలో కనుక ఏకాగ్రతను సాధిస్తే అదే శక్తిని ఉపయోగించి అన్ని విద్యలనూ నేర్చుకోవచ్చు. విలువిద్యతోపాటు మిగిలిన యుద్ధవిద్యలన్నింటిలో కూడా అర్జునుడు గొప్ప ప్రావీణ్యాన్ని సాధించాడు కదా! కాబట్టి, 'నాకు ఫలానా విషయంలో ఏకాగ్రత ఉంది గానీ మిగిలిన వాటిలో లేదండీ' అనడం సరి కాదు. ఆ విషయం మీద ఉన్న ఆసక్తివల్ల బహుశా మనకు అందులో ఎక్కువ ఏకాగ్రత, దాని ద్వారా నైపుణ్యం కలుగుతూ ఉండవచ్చు. కానీ మనం చక్కగా అభ్యాసం చేసి ఏకాగ్రతను అలవరచుకున్నప్పుడు అన్ని విద్యలలోనూ రాణించగలుగుతాము. ఈ ఏకాగ్రతను, ఏ వయస్సులోని వారైనా సాధన ద్వారా పెంపొందించుకోవచ్చు.

## 15. రోజువారీ జీవితంలో ఏకాగ్రత

సాధారణంగా మన ఏకాగ్రతాశక్తి ఎంత ఉంటుంది? అది ఎంతవుందో తెలుసుకోవడం ఎలా? మన మనస్సు ఎలా పని చేస్తోందో తెలుసుకోవాలంటే ముందుగా మన శరీరం చేసే పనులను కనిపెట్టాలి. శరీరంతో పనిచేయించేది మనస్సే కాబట్టి, ముందు మనం చేస్తున్న పనులు ఎలా ఉన్నాయో

మనమే పరిశీలించుకోవాలి. మన మనస్సు మన దగ్గరే ఉంది కానీ మన అదుపులో, మన స్వాధీనంలో లేదు. దానిని ఎలా మన అదుపులోకి తెచ్చుకోవాలో ముందు అర్థం చేసుకోవాలి.

'సమస్య ఏమిటో తెలిస్తే నూటికి తొంభైపాళ్ళు పరిష్కారం దొరికినట్టే!' అని ఒక శాస్త్రజ్ఞుడు చెప్పాడు. ఏకాగ్రత లోపించడమే మన సమస్య అనీ, దాన్ని సాధించడమే పరిష్కారమనీ ముందు మనం గ్రహించాలి.

ఇక, ఏకాగ్రతను సాధించడం మనల్ని మనం పరిశీలించు కోవడం వల్లనే సాధ్యమవుతుంది. ముందుగా మనల్ని మనం పరిశీలించుకుని, ఎక్కడ పొరపాటు చేస్తున్నామో తెలుసుకోవాలి. మనస్ఫూర్తిగా ఆ పొరపాట్లను సరిదిద్దుకుని, వాటిని తిరిగి చేయకుండా ఉండడానికి ప్రయత్నించాలి.

మనకు నిత్యం ఎదురయ్యే కొన్ని ఉదాహరణలను చూద్దాము. ఇవి కేవలం ఉదాహరణలు మాత్రమే. వీటిని చూసిన తర్వాత మన జీవితాలలో జరిగే రకరకాల సందర్భా లలో ఏకాగ్రత ఎలా పనిచేస్తుందో మనకు కొంత అవగాహన వస్తుంది. దానిని గురించి మరింతగా ఆలోచించి, అన్ని పనులలోనూ అత్యున్నతమైన ఏకాగ్రతను సాధించడానికి మనం కృషి చేయాలి.

మట్టితో బొమ్మ చేద్దామని కూర్చున్నామనుకోండి. ముందు ఆ మట్టిని తడిపి, చక్కగా మర్దించి, దానిలో ఏమైనా రాళ్ళు, గడ్డలు ఉంటే ఏరివెయ్యాలి. అప్పుడు దానితో బొమ్మ చేయడానికి ప్రయత్నించాలి. మట్టి తయారు చేసేటప్పుడు దానిలో వచ్చిన రాళ్ళను సరిగా ఏరివెయ్యకపోతే, బొమ్మ చేసేటప్పుడు అవి అడ్డుపడతాయి. మట్టిముద్దను పూర్తిగా వెతకడానికి ఏకాగ్రత కావాలి. ఏకాగ్రత లేకపోతే రాయి

ఎదురుగా ఉన్నా కనపడదు! ఇక, ఏదైనా బొమ్మను ముందు ఉంచుకుని, దాన్ని చూసి మనం బొమ్మను తయారు చేయడానికి ప్రయత్నించవచ్చు. అటువంటి ప్రయత్నంలో ఎదురుగావున్న బొమ్మను చక్కగా చూసి, అది ఎలా ఉందో మనస్సులో ఊహించుకుని, దానితో బొమ్మను చేయాలి.

ఫుట్‌బాల్ ఆట ఆడాలంటే బంతిని కోరిన దిక్కులోకి, కోరినంత దూరం, కోరిన వేగంతో తన్నడం నేర్చుకోవాలి. దీనికి అభ్యాసం అవసరం. బలం పెంచుకోవడానికి వ్యాయామం చేయడంతోపాటు, బంతిని తన్నడం సాధన చేయాలి. అనేకసార్లు బంతిని తన్నుతూ, అది మనం కోరిన మార్గంలో పోతున్నదో లేదో గమనించాలి. మొదటిసారే మనం అనుకున్నట్టుగా బంతిని గోల్‌లోకి తన్నలేము. అయితే సాధన చేసిన కొద్దీ ఏకాగ్రత పెరిగి, మన కోరిన చోటికి బంతిని కొట్టగలిగే శక్తి వస్తుంది. శరీరం, మనస్సు రెండూ చక్కని సమన్వయానికి వచ్చినపుడే ఫుట్‌బాల్ ఆటలో మనకు ప్రావీణ్యత వచ్చినట్టు. అర్జునుడు గురిగా బాణాలు వేయడానికి ఎంత సాధన చేసి ఉంటాడో ఊహించండి!

యోగాసనాల ద్వారా శరీరం బలంగా, ఆరోగ్యంగా పెరగడంతోపాటు, మనస్సు మీద మంచి పట్టు వస్తుంది. ఆసనం వేసేటప్పుడు ఫలానా భంగిమలో ఉండాలని చెపుతారు. ఆ భంగిమలో శరీరాన్ని కొంతసేపు ఉంచాలి. కానీ అలా చేస్తే, మొదట్లో శరీరంలో విపరీతమైన నొప్పి కలుగుతున్నట్టు అనిపిస్తుంది. ఒక ఆసనాన్ని ఇరవై సెకండ్లు వెయ్యాలంటే, అదే ఇరవై యుగాలలాగా తోస్తుంది. అయితే, ఆ నొప్పిని భరించి ఆసనాన్ని వెయ్యాలి. నిజానికి, ఆ సమయం పూర్తయ్యాక శరీరంలో ఏ నొప్పీ ఉండదు. అయితే

దాన్ని చేసే సమయంలోనే మనస్సు నానా గొడవ సృష్టించి, మనం ఆసనం వేయకుండా చేస్తుంది. ఆ సమయంలో మనస్సును నిగ్రహించి, ఆసనాన్ని వెయ్యాలి. మనస్సు తెచ్చి పెట్టే నొప్పిని అదుపుచేయడం కూడా ఏకాగ్రతను నేర్వడంలో ఒక భాగమే. అర్జునుడు యుద్ధం చేసేటప్పుడు ఎదుటివారి బాణాలు వచ్చి అతడికి గుచ్చుకునేవి. అయితే అతడు అంత నొప్పినీ భరించి యుద్ధాన్ని కొనసాగించాడు కదా!

విజ్ఞానశాస్త్రంలోని పైథాగరస్ సిద్ధాంతం, క్రెబ్స్ వలయం మొదలైన విషయాలను చదివారనుకోండి. వాటిలో అనేక అంశాలు ఒకదాని తర్వాత ఒకటి వస్తాయి. వాటన్నింటినీ వరుసలో గుర్తుపెట్టుకోవాలి. ఏదోవొక సమయంలో కూర్చుని వాటిని గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నిస్తే అవి వరుసగా గుర్తుకు రావు. అయితే అనేకసార్లు చదవడం ద్వారా, అర్థం చేసుకోవడం ద్వారా, అనేకసార్లు మననం చేయడం ద్వారా, ఏమాత్రం మర్చిపోకుండా పూర్తిగా జ్ఞాపకం ఉంచుకునే స్థితికి చేరుకుంటాము. విషయాలను వరుసగా మనస్సులో పెట్టుకుని పనిచేయడానికి ఏకాగ్రత కావాలి.

కుట్టుపనిలో కొలతలు తీసుకునేటప్పుడు, గుడ్డను కత్తిరించేటప్పుడు మనస్సు పూర్తిగా దానిమీదే ఉండాలి. కుట్టే టప్పుడు మిషన్ సరిగా నడుస్తున్నదో లేదో, మన చేతులు సరిగా గుడ్డను కదుపుతున్నాయో లేదో, కాళ్ళు సరిగా తొక్కు తున్నాయో లేదో గమనించాలి. కుట్టు వంకరటింకరగా పడితేనే అది పెద్ద సమస్య అయితే, ఇక వేలిలో సూది దిగ బడితే సరేసరి. మనస్సు ఎక్కడో పెట్టుకుని పనిచేసే దర్జీ, “మీరు ఇచ్చిన గుడ్డ పాడయిపోయింది, ఇంకొకటి తెచ్చు కోండి!” అని కష్టమరుతో చెపితే జరిగేది యుద్ధమే కదా!

కంప్యూటర్లు మనకు మిత్రులు కాగలవు, శత్రువులూ కాగలవు. ఒక విధంగా చూస్తే, అవి మనకు ఏకాగ్రత నేర్పించడానికి పనికి వచ్చే చక్కని యంత్రాలు. కంప్యూటరుకు మనం సరైన కమాండ్ ఇవ్వకపోతే అది మనకు సరైన సమాధానాన్ని ఇవ్వలేదు. ఆ విధంగా అవి మనకు 'ఒళ్ళు దగ్గర పెట్టుకోవడం' నేర్పించగలవు. మనస్సు ఏకాగ్రతతో ఉంటే తప్ప మనం కోరినట్టుగా దానిచేత పని చేయించుకోలేము. ఆ విధంగా మన మనస్సుకు నిలకడ నేర్పేందుకు కంప్యూటర్లు సహాయపడగలవు. మరొకవైపు, కంప్యూటర్లతో ఒక గొప్ప అపాయం కూడా ఉంది. వాటిలో మన మేధాశక్తిని వృథా చేసే గేమ్స్ ఉన్నాయి. మాదక ద్రవ్యాల లాగా మన మనస్సును కట్టిపడవేసి, నిర్వీర్యం చేసివేయగల శక్తి వాటికి ఉంది. మత్తుమందుకు బానిసైన వాడు అది లేకపోతే నిలబడలేడు. అలాగే ఈ గేమ్స్‌కు బానిసైనవాడు కూడా రాత్రీపగలూ దానిలోనే మునిగి వుండడం వల్ల మనస్సు అదుపు తప్పిపోతుంది. ఈ సందర్భంగా అర్థం చేసుకోవలసిన విషయమేమిటంటే, కంప్యూటర్లు కానీ, సెల్‌ఫోన్లు కానీ, ఏ ఇతర వస్తువు కానీ – మనల్ని అది అదుపు చేయకూడదు; అదే మన స్వాధీనంలో ఉండాలి. మనం అవసరం మేరకు దాన్ని వాడుకోగలగాలి; ఎప్పుడు కావాలంటే అప్పుడు దాన్ని పక్కనపెట్టగలగాలి.

సంగీతం, నృత్యం, నాటకం మొదలైన కళలను నేర్చుకోవడం ఏకాగ్రతను అలవరచుకోవడానికి చాలా చక్కని మార్గం. గురువు ఎదురుగా కూర్చుని నేర్చుకుంటున్నప్పుడు, మన తప్పులను సరిచేస్తూ అనేకసార్లు అతడు మనచేత అభ్యాసం చేయిస్తాడు. ఆ అభ్యాసమే మనకు ఏకాగ్రతను నేర్పుతుంది.

దానికి తోడు ఈ కళలకు స్వతహాగా గొప్ప ఏకాగ్రతను కలిగించగల శక్తి ఉంది. కళలను నేర్చుకోవడానికి పుట్టుకతో వచ్చే నైపుణ్యం కొంత అవసరం. అందరూ వాటిని నేర్చుకోలేకపోవచ్చు. అయితే మంచి సంగీతాన్ని వినడం ద్వారా ఏకాగ్రతను అలవరచుకోవచ్చు. "*మనిషి మనస్సు మీద అమోఘమైన ప్రభావాన్ని చూపగలిగే శక్తి సంగీతానికి ఉంది. అది క్షణంలో మనస్సుకు ఏకాగ్రత కలిగేలా చేస్తుంది. ఎన్నడూ తమ మనస్సును ఏకాగ్రం చేయడానికి ప్రయత్నించని వారి మనస్సును కూడా సంగీతం ఒక్క క్షణంలో ఏకాగ్రపరుస్తుంది*" అని స్వామీజీ చెప్పారు. అయితే, ఈనాడు అంతటా వినపడుతున్న డబ్బారేకుల సంగీతం కాక, మనస్సుకు బలాన్నిచ్చే, భక్తిభావం కలిగిన సంగీతాన్ని, పౌరుషాన్ని ఇచ్చే సంగీతాన్ని వినడం అవసరం.

ఎన్నో సంవత్సరాలపాటు నేర్చుకున్న సంగీత విద్యార్థులు కూడా పాటల పోటీలోనో, కచ్చేరీలోనో పాడబోయి తత్తరపడ తారు. ఎందుకంటే తన పాట గురించి ఎవరేమనుకుంటారో అన్న భయం వారి మనస్సులలో కలిగి, వారి ఏకాగ్రత చెదిరి పోతుంది. అలా పదిమంది ముందు కచ్చేరీ చేసేటప్పుడు తాను నేర్చుకున్నదాని మీదే మనస్సును ఏకాగ్రం చేసి పాడాలి కానీ, ఎవరేమనుకుంటారో అని ఆలోచించకూడదు.

ఇక, విద్యార్థులందరూ ఏకాగ్రతను కోరుకునేది వారి చదువులో విజయం కోసమే. అయితే, పుస్తకం చేతిలోనే ఉంటుంది కానీ మనస్సు మాత్రం ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటుంది. గంటసేపు గడిచినా ఒక్క వాక్యం కూడా చదువ కుండా కూర్చునే విద్యార్థులు ఎంతోమంది కనిపిస్తారు. పాపం, ఎంతో నిజాయితీతో వారే ఇలా జరిగిందని ఒప్పు

కుంటారు కూడా. ఇంకా ఘోరమేమిటంటే, ఆ గంటసేపు దేని గురించి ఆలోచిస్తున్నావని అడిగితే అది కూడా చెప్ప లేరు. అంటే మనస్సు అంత అదుపు తప్పిపోయిందన్నమాట. సినిమాలు, టీవీ చూసేటప్పుడు కానీ, తమకు నచ్చిన పని చేసేటప్పుడు కానీ, ఏకాగ్రత లేదని ఎవరూ చెప్పరు. మరి, చదువుకోవడానికి కూర్చోగానే, అది తప్ప, ప్రపంచంలోని 'ఇతర అతి ముఖ్యమైన విషయాలు' అన్నీ మనస్సులోకి జొర బడతాయి. ఏవేవో గుర్తుకు వస్తాయి. ఇక ఆ చదువు గాలికి ఎగిరిపోతుంది. చదువుకునే సమయంలో మనస్సును పారిపోనిచ్చే అలవాటు మనమే చేసుకున్నాము. ఆ అలవాటును మార్చుకోవడమే మనం చేయాల్సిన పని.

చివరిగా, పరీక్షలు వ్రాయడానికి కూడా ఏకాగ్రత కావాలి. పరీక్షలో ఏమి ప్రశ్నలు ఇచ్చారు, ఏమి వ్రాయాలి అన్న విషయాలనే ఆలోచించాలి. ఏకాగ్రతతో ప్రశ్నలు చదువక పోతే ఒక ప్రశ్నకు వేరొక సమాధానం వ్రాసి వస్తారు. ఇక, ఆ సమయంలో పరీక్షల ఫలితాల ఏమవుతాయోనని ఆలోచించకూడదు. పరీక్ష వ్రాయడమే మన వంతు కానీ దాని ఫలితం గురించి ఆలోచించి ప్రయోజనం లేదు.

*"సగటు మనిషి తన ఆలోచనాశక్తిలో తొంభైశాతాన్ని వృథా చేస్తాడు. అందుచేతనే అన్ని పనులలోనూ పప్పులో కాలు వేస్తుంటాడు. ఎవరైతే మనస్సుకు చక్కగా శిక్షణ ఇచ్చి, ఏకాగ్రత నేర్పుతారో, అటువంటివారు ఎట్టి పరిస్థితులలోనూ పొరపాటు చేయరు"* అని స్వామీజీ చెప్పారు.

ఈ విధంగా ఏకాగ్రతాశక్తిని మన నిత్యజీవితంలో ఎలా వినియోగించుకుంటున్నామో అర్థం చేసుకున్నాం. ఇక దాన్ని పెంపొందించుకోవడం ఎలా?

## 16. కొండంత బలం కావాలి

ఈ ఏకాగ్రత అనేది పుట్టుకతో వచ్చేది కాదు. అభ్యాస వైరాగ్యాల ద్వారా దానిని ఒక అలవాటుగా తయారు చేసుకోవాలి. ఈ అభ్యాసవైరాగ్యాల గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే. ఎందుకంటే జీవితంలో ఏది సాధించాలన్నా అభ్యాసవైరాగ్యాలే శరణ్యం. అభ్యాసమంటే నేర్చుకోదలచిన పనిని మళ్ళీమళ్ళీ ఉత్సాహంతో చేయడం. వైరాగ్యమంటే మనస్సును పూర్తిగా చేయవలసిన విషయం మీదే ఉంచి, మిగిలిన అన్ని ఆలోచనలనూ విడిచిపెట్టడం. అర్జునుడు తాను విలువిద్య సాధన చేసేటప్పుడు చేసినదదే.

బలమే అభ్యాసవైరాగ్యాలకు ఊతం. బలహీనుడు వాటిని సాధించలేడు. కాబట్టి, ఈ బలాన్ని గురించి, దానిలోని రకాలను గురించి తెలుసుకుందాము.

**శారీరిక బలం:** *"బలం, బలం, బలం! అన్ని విషయాలలోనూ బలమే మనకు కావాలి!"* అని స్వామీజీ చెప్పారు. బలం గల మనస్సుకే ఏకాగ్రతను సాధించే శక్తి ఉంటుంది. మరి మనస్సుకు బలం కావాలంటే శారీరికబలం కావాలి. "ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః', 'నాయమాత్మా బలహీనేన లభ్యః' అని దృఢమైన, బలిష్ఠమైన శరీరం ఉన్నవాడే ఏదైనా సాధించగలడని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి! శరీరంలోని సూక్ష్మమైన అంశమే మనస్సు. (అంటే మనస్సు కూడా మన శరీరంలో ఒక భాగమే) శరీరానికి తగిన బలం లేకుండా

మనస్సుకు ఎప్పటికీ బలం రాదు. బలమైన శరీరం లేనివాడు ఒక గంటసేపు కదలకుండా కూర్చోలేడు కూడా! అందుకనే స్వామీజీ, ముందు శరీరాన్ని బలంగా చేసుకోమని మనకు ఉద్బోధించారు. "*ఇనుప కండలు, ఉక్కు నరాలు, వాటిలో పిడుగులాంటి పదార్థంతో చేసిన మనస్సు*" కావాలన్నారు. అర్జునుడికి అటువంటి బలమైన శరీరం ఉంది కాబట్టే అతడు మనస్సును చక్కగా అదుపులో ఉంచుకోగలిగాడు. తాను నేర్చుకోదలచిన విద్యను త్వరత్వరగా నేర్చుకున్నాడు.

ప్రతి రోజూ చెమటలు పట్టే వరకూ వ్యాయామం చేయాలి. ఆరుబయట ఆటలు ఆడాలి. ఆడేటప్పుడు, కేవలం కాలక్షేపం కోసం కాక, శక్తికొద్దీ ఆడాలి. అంతేకాక, ఆడేటప్పుడు ప్రతిసారీ తానే నెగ్గాలి; గెలుపు కోసం తప్పొప్పులను పట్టించుకోను; అన్న పోకడలు సరైనవి కావు. ఏకాగ్రతతో మరింత బాగా ఆడేందుకు ప్రయత్నించాలి.

**యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ (గీత 6:17)**

భగవద్గీతలోని ఈ అద్భుతమైన శ్లోకమే మనకు జీవితంలో మార్గదర్శి. అన్ని విషయాలలోనూ యుక్తంగా, అంటే 'ఎంత చేయాలో అంత' చేయమనీ, దాని ద్వారా మీరు యోగస్థితిని, అంటే అత్యున్నతమైన కౌశలాన్ని పొందుతారనీ ఈ శ్లోకం వివరిస్తుంది. ఆహారంలోనూ, విహారంలోనూ, పనులలోనూ, చేష్టలలోనూ, నిద్రలోనూ, మెలకువలోనూ మనం 'యుక్తంగా', అంటే ఎంత అవసరమో అంత చేయాలని ఈ శ్లోకం మనకు బోధిస్తోంది. రోజువారీ జీవితంలో మనం చేస్తున్న పనులన్నింటినీ ఈ శ్లోకంతో బేరీజు వేసుకుని పనిచేయాలి.

**మానసికబలం:** మన స్వాధీనంలో ఉండి, మనం చెప్పిన మాట వినేదే బలమైన మనస్సు. సాధారణంగా ఏదైనా పోటీ పరీక్షలో విఫలమయ్యాననో, చేయవలసిన పని కష్టంగా అనిపించిందనో, అనారోగ్యం వల్ల జీవితం తల్లక్రిందులు అయిందనో నిస్పృహలో మునిగిపోవటం, ఓటమి బాధతో మరలా కోలుకోకపోవడమే మానసిక దౌర్బల్యం అని చెప్పుకోవచ్చు. ప్రతికూల పరిస్థితులు ఎంతగా మనల్ని అణచివేస్తున్నా, మరలమరల పోరాడడానికి ప్రయత్నించడం మానసికబలాన్ని సూచిస్తుంది. అర్జునుడికి ఎన్ని కష్టాలు ఎదురైనా అతడు చతికిలబడలేదు కదా!

మనస్సును బలమైనదిగా చేసుకునే పద్ధతిని స్వామీజీ వివరిస్తూ, *“ముందుగా మీరు మీ శరీరాన్ని మంచి ఆహారంతో బలమైనదిగా చేసుకోవాలి. అప్పుడే మీ మనస్సు బలంగా తయారు కాగలదు. ఎందుకంటే, మన శరీరంలోని సూక్ష్మమైన అంశమే మనస్సు. ఆపైన, మీ మనస్సులోనూ, వాక్కులోనూ గొప్ప బలాన్ని, శక్తిని ప్రదర్శించాలి. ఎప్పుడూ 'నేను నీచుణ్ణి, నేను నీచుణ్ణి!' అనుకునేవాడు నిజంగానే దిగజారి, అధోగతి పాలవుతాడు. ఎవడైతే అనుక్షణం తాను ఆత్మస్వరూపుడినన్న భావంతో, తాను స్వేచ్ఛగలవాణ్ణని అనుకుంటూ ఉంటాడో, అటువంటి వాడే నిజంగా సర్వస్వతంత్రుడు అవుతాడు. ఎవడైతే నిరంతరం తాను కష్టాలలో ఉన్నాననీ, బంధాలలో ఉన్నాననీ అనుకుంటాడో వాడు నిజంగానే బంధాలలో పడి, కష్టాలపాలవుతాడు. మీరు ధీరులుగా తయారవ్వండి! 'నాకు భయం లేదు!' అని ఎల్లప్పుడూ చెప్పండి. భయమే మరణం, భయమే పాపం, భయమే నరకం, భయమే అధర్మం, భయమే తప్పుడు జీవితం!*

*ప్రపంచంలో మనకు కనిపించే వ్యతిరేకపు ఆలోచనలు, ప్రతికూలభావాలు, దుర్మార్గాలు – అన్నీ ఈ భయం అనే దుష్టశక్తిలో నుంచి పుట్టినవే! అందుచేతనే నేను, 'అభీః! అభీః!' 'నిర్భయులుగా ఉండండి! నిర్భయులుగా ఉండండి!' అని చెపుతూ ఉంటాను!"* అని ఉద్బోధించారు.

**ఆధ్యాత్మికబలం:** మనలో ఉన్న ఆత్మను, భగవంతుణ్ణి విశ్వ సించడమే ఈ బలం. సాధారణంగా ఎవరినైనా, "నువ్వు ఎవరు?" అని అడిగితే, వారు తమ ఊరూపేరూ చెపుతారు, తాము సాధించిన ఘనత గురించి చెపుతారు. అయితే, జీవితంలో కొన్నిసార్లు విఫలమైనప్పుడు తమ శక్తియుక్తుల మీద సందేహం కలుగుతూ ఉంటుంది. సందేహమే మనకు పరమశత్రువు. కాబట్టి వాటికంటే ఉన్నతమైన, శాశ్వతమైన ఒక శక్తి మీద మనకు విశ్వాసం ఉండాలి. అందుచేతనే, *"విశ్వాసం, విశ్వాసం, రగిలే విశ్వాసం! మీమీద మీకు విశ్వాసం, భగవంతుడి మీద విశ్వాసం! ఇదే గొప్పతనానికి మార్గం!!"* అని స్వామీజీ చెప్పారు.

శారీరిక, మానసిక బలాలకు తోడు, మనకు ఆధ్యాత్మిక బలం కావాలి. మనం ఆత్మస్వరూపులమని నిరంతరం అను కోవాలి. *"ఎప్పుడు మనిషి తాను ఆత్మస్వరూపుణ్ణని స్పష్టంగా తెలుసుకుని పనిచేస్తాడో, జీవితంలో మసలు కుంటాడో, అప్పుడు శక్తి వస్తుంది, ఖ్యాతి వస్తుంది, అద్భుతమైనవన్నీ వస్తాయి!"* అంటూ స్వామీజీ మనలను ఉత్సాహ పరుస్తున్నారు. అంతేకాక, భగవంతుడి మీద మనకు విశ్వాసం ఉండాలి. ఈ విశ్వాసాలే ఆధ్యాత్మికబలం.

పారమార్థిక సాధనలైన జపం, ధ్యానం కూడా మనస్సుకు చక్కని ఏకాగ్రతను కలిగించగలవు.

## 17. మనస్సుకు ఏకాగ్రత అలవరచడం ఎలా?

**మనస్సు స్వభావం, దాని స్వాధీనం:** అసలు మనస్సుకు ఏకాగ్రత ఎందుకు లేదు? ఎందుకంటే మనస్సు స్వభావమే అటూయిటూ పరుగెత్తడం. దానికి ఒకే విషయం మీద నిలబడి ఉండడాన్ని నేర్పించాలి. అది ఎలా?

ఒక కథ చెప్పుకుందాం. ఒక కోతులు ఆడించేవాడు ఉన్నాడు. వాడి దగ్గర ఒక కోతి ఉంది. దాన్ని ఒక కొయ్యకు కట్టివేశాడు. అదే కొయ్య మీదకు ఎక్కి దాని మీదే కొంతసేపు నిలబడి ఉండడాన్ని ఆ కోతికి వాడు నేర్పిస్తున్నాడు. కోతిని ఒక బెత్తంతో అదిలించగానే అది భయపడి, వాడి దెబ్బను తప్పించుకోవడానికి కొయ్య మీదకు ఎక్కింది. అయితే అది కోతి కదా! మరుక్షణమే క్రిందకు దిగి, అటూయిటూ తిరుగుతోంది. వాడు మళ్ళీ బెత్తం చూపగానే కొయ్య ఎక్కింది. అలా ఆ కోతి క్రిందికి దిగినప్పుడల్లా వాడు దానికి బెత్తం చూపించి పైకెక్కించసాగాడు. చివరికి ఆ కోతి ఆ కొయ్య మీదే ఉండడాన్ని నేర్చుకుంది. మనస్సుచేత అభ్యాసం చేయించడం కూడా ఇంతే. అది మాటిమాటికీ అటూయిటూ పారిపోవాలని చూస్తూ ఉంటుంది. దానిని నయానాభయానా ఒకే విషయం మీద నిలచి ఉండడాన్ని నేర్పించాలి. అలా అభ్యాసంతో మనస్సు ఏకాగ్రతను నేర్చుకుంటుంది.

**అవహేళన పనికిరాదు:** ప్రతి దానినీ అవహేళన చేసే చెడు లక్షణం ఒక రోగంలాగా మనం దేశంలోని మనుష్యులకు పట్టుకుందని స్వామీజీ చెప్పారు. ఆ లక్షణాన్ని వదిలించుకోవాలి. ఏదైనా విషయం మీద గౌరవం లేకపోతే దాని మీద ఏకాగ్రత ఎలా కుదురుతుంది? మన గురువుల

మీద, మనకు అప్పగించబడిన పని మీద, మనం ఎదుర్కొనే పరీక్షల మీద, మనం జీవితంలో సాధించాలనుకుంటున్న లక్ష్యం మీద మనకు శ్రద్ధ, అభిమానం, గౌరవం ఉండాలి. అప్పుడే మనకు ఏకాగ్రత కలుగుతుంది.

**మన లక్ష్యాన్ని ప్రేమించాలి:** చేసే పని మీద ఇష్టం (ప్రేమ) లేకపోతే ఇక దానిమీద ఎప్పటికీ మనకు ఏకాగ్రత కలుగదు. *"విజయం సాధించాలంటే చిత్తశుద్ధి, ఓరిమి, పట్టుదల అనేవి మూడూ అతి ముఖ్యమైన విషయాలు. వాటికి మించి, చేసే పని మీద ప్రేమ ఉండాలి!"* అని స్వామీజీ చెప్పారు. అయితే చేసే పని మీద ప్రేమ లేకపోతే ఏమి చేయాలి? నేర్చుకోవాలి! చేసే పనిని ఇష్టపడాలి, ప్రేమించాలి. ఆ పనివల్ల మనకు, మన తోటివారికి, మన దేశానికి ఎలా మేలు కలుగుతుందో ఊహించుకుంటే, దాని మీద ప్రేమ కలుగుతుంది. అలా మనస్సును దారిలోకి తెచ్చుకున్నప్పుడు అది మనం తల పెట్టిన పని మీద చక్కగా ఏకాగ్రమవుతుంది.

**మనస్సుతో స్నేహం చేయాలి:** మనస్సుతో వైరం పెంచుకో కూడదు. మనస్సును స్నేహితుడిగా తయారుచేసుకోవాలి. పదేపదే నచ్చచెప్పడం, బ్రతిమాలడం (auto-suggestion) అవసరమైతే బెదిరించడం ద్వారా మనస్సును దోవలో పెట్టు కోవాలి. మనం చెపితే మనస్సు వింటుంది. ఇది నిజం! అలా మనస్సును చాలా చక్కని పరికరంగా తయారు చేసుకోవచ్చు. అప్పుడు మనం చేసే పనులన్నీ ఎంతో సులభమైపోతాయి.

**నెమ్మది నెమ్మదిగా:** "శనైః శనైః ఉపరమేత్ బుద్ధ్యా ధృతి గృహీతయా।" (గీత 6:25) అని చెప్పినట్టు పట్టువదలకుండా ప్రయత్నిస్తూ నెమ్మదినెమ్మదిగా మనస్సును మన స్వాధీనం లోకి తెచ్చుకోవాలి.

## 18. మనకున్నది ఒకటే మనస్సు!

మనం రోజంతా చేసే పనులు మన ఏకాగ్రతను ప్రభావితం చేస్తాయన్నది మనం అన్నిటికన్నా ముందుగా తెలుసుకోవలసిన విషయం. మనిషి తన ఆలోచనల ద్వారా చేసే పనులన్నీ చేసిపెట్టే పరికరం ఒకటే - అదే మనస్సు. ఇది లోపల ఉండి పనిచేసే పనిముట్టు కనుక దీనిని అంతః కరణం అంటారు. మనకు రెండు మనస్సులు లేవు. 24 గంటలూ మనం ఒకే మనస్సుతో పనిచేస్తామని మరచిపో కూడదు. ఈ విషయాన్ని అర్థం చేసుకోవడం ఏకాగ్రతను నేర్చుకోవడానికి ఎంతైనా అవసరం.

ఒక పిల్లవాడు ఉన్నాడు. తండ్రి గడ్డం గీసుకోవడానికి వాడుకునే బ్లేడును తీసుకుని దానితో వాడు తన పెన్సిల్ చెక్కుకున్నాడు. ఆ తర్వాత అదే బ్లేడుతో కొన్ని కాగితాలు కోసి ఆడుకున్నాడు. ఆ తర్వాత దానితో కొన్ని ఆకుల్ని కోసి బొమ్మలు చేశాడు. చివరికి దాన్ని మట్టిలో పడవేసి వెళ్ళిపోయాడు. ఇదంతా చేసిన తర్వాత, తిరిగి అదే బ్లేడుతో అతడి తండ్రి గడ్డం చేసుకోగలుగుతాడా? చేసుకోలేడు. ఎందుకంటే ఆ బ్లేడు పదును కోల్పోవడమే కాక దాని మీద చాలా నొక్కులు పడ్డాయి. మన మనస్సు కూడా అంతే. మనం రోజంతా చేసే పనుల్ని ఏమాత్రం ఏకాగ్రత లేకుండా చేస్తూ, మనస్సును ఇష్టప్రకారం పరుగెత్తనిచ్చి, దానికున్న చెడు అలవాట్లన్నింటిలో హాయిగా మునిగితేలనిస్తాం. బ్లేడు మీద పడిన నొక్కులలాగా మన చెడు అలవాట్లు కూడా ముదిరిపోయాయి. ఇక రోజంతా గంతులు వేసిన మనస్సు, మనం కోరగానే ఏకాగ్రతతో పనిచేయగలుగుతుందా?

కొందరు బలమైన కుక్కలను వాహ్యాళికి తీసుకుపోతూ ఉంటారు. అయితే వాళ్ళు ఆ కుక్కను నడిపిస్తున్నారో, ఆ కుక్కే వాళ్ళను నడిపిస్తోందో చూపరులకు అర్థం కాదు. అది ఎటు లాగుకునిపోతే, వాళ్ళు అటే పోతూ ఉంటారు. మనస్సుతో మన వ్యవహారం కూడా ఇలాగే ఉంటుంది. మనస్సు సహజంగానే చాలా బలమైనది. ఇక ఒక్కసారిగా దాన్ని ఏకాగ్రం చేయడానికి ప్రయత్నిస్తే, అది మాట వింటుందా? కుక్కకు ఎలా తర్ఫీదు ఇచ్చి అది యజమాని మాట వినేలా చేస్తారో, అలాగే మనస్సుకు కూడా తర్ఫీదు ఇవ్వాలి.

మరి మనస్సుకు తర్ఫీదు ఇచ్చేది ఎలా? రోజులో ఏ పని చేస్తున్నా, మీ మనస్సు మొత్తాన్ని ఆ పని మీదే పెట్టి పని చేయాలి. మనం అంత ముఖ్యం కానివనుకునే పనుల మీద కూడా పూర్తిగా మనస్సు పెట్టి పనిచేయాలి. పళ్ళు తోముతున్నా, స్నానం చేస్తున్నా, అన్నం తింటున్నా, టీవీ చూస్తున్నా, స్నేహితులతో కబుర్లు చెపుతున్నా, సైకిలు తొక్కుతున్నా, ఆటలాడుతున్నా, కారు నడుపుతున్నా, సంగీతం వింటున్నా – ఏమి చేస్తున్నా సరే – మనస్సు మొత్తాన్ని దాని మీదే పెట్టండి. ఇలా రోజంతా, అన్ని పరిస్థితులలోనూ మనస్సు ఏకాగ్రతతో పనిచేసేలాగా దానికి తర్ఫీదు ఇవ్వాలి. అదొక్కటే మార్గం. అలా తయారైన మనస్సు క్రమంగా మనం కోరిన విషయం మీద, కోరిన సమయంలో ఏకాగ్రత చూపించడాన్ని నేర్చుకుంటుంది. ఈ అభ్యాసానికి ఎన్నో సంవత్సరాలు పట్టదు కూడా. పట్టుదలతో చేస్తే, ఆరు నెలలలోనే చక్కని ఏకాగ్రతను సాధించవచ్చు.

రోజంతా మన ప్రవర్తన ఎలా ఉందో గమనించుకోవాలి. మంచి పనులు చేసే సత్ప్రవర్తన ఉన్నవాడి మనస్సు

మాత్రమే శాంతంగా ఉండగలదు. శాంతంగా ఉన్న మనస్సు మాత్రమే గొప్ప ఏకాగ్రతను సాధించగలదు. ద్వేషం, అసూయలతో కుతకుతలాడే మనస్సు ఏకాగ్రత సాధించ లేదు. సూదిలో దారం ఎక్కించడానికి దారం కొనను తడిపి, చక్కగా పురిపెడితే, అప్పుడు అది సూదిబెజ్జంలోకి దూరుతుంది. అలా కాక, దారపు పోగులలో ఒక్క పోగు విడిగా బయటకు ఉన్నా అది సూదిబెజ్జంలో దూరకుండా అడ్డుపడుతుంది. అలాగే మనస్సులో ఏ విధమైన అలజడి లేకుండా ఉన్నప్పుడే అది చక్కని ఏకాగ్రత సాధించగలదు.

జపాన్ దేశంలో 'జెన్-బౌద్ధమత'పు అనుయాయులు విలు విద్యను సాధన చేసే విధానాన్ని అత్యున్నత స్థాయికి చేర్చారు. వారు నేర్చుకునే విధానంలో శరీరంలోని ప్రతి కదలికనూ అతి జాగ్రత్తగా నియంత్రిస్తూ సాధన చేస్తారు. వారు చెప్పే పద్ధతిలో మన శరీరాన్ని, మనస్సును స్వాధీనంలో ఉంచు కోవడమే అత్యున్నతమైన సాధన. అనేక సంవత్సరాలపాటు తమ పద్ధతిని మెరుగుపరుచుకోవడంలోనే వారు నిమగ్న మవుతారు. చివరికి తాము వేసిన బాణం దాని లక్ష్యానికి తగిలిందా, లేదా అన్న విషయం కూడా ముఖ్యం కాదని వారు చెపుతారు. ఆ విధంగా సాధన చేసే జెన్ యోధులు ప్రపంచంలోనే అత్యుత్తమ విలుకాళ్ళుగా పేరొందారు.

## 19. ప్రయత్నంతో పనిచేసే బుద్ధి

*"ఏకాగ్రతకు అభ్యాసం కన్నా వైరాగ్యమే ముఖ్యమైనది"* అని స్వామీజీ చెప్పారు. ఏదైనా పనిచేద్దామని కూర్చున్న ప్పుడు మిగిలిన ఆలోచనలన్నింటినీ ఆపివెయ్యాలి. ముందు గానే, 'ఈ గంట, రెండు గంటలు నేను కదలను!' అని

గట్టిగా తీర్మానించుకోవాలి. గౌతమ బుద్ధుడు బోధివృక్షం క్రింద కూర్చుని, 'ఇహాసనే శుష్యతు మే శరీరం..' అని దీక్ష పూనాడు. 'నా శరీరం శుష్కించిపోయినా సరే, పరమ సత్యాన్ని తెలుసుకునే వరకూ, ఇక్కడ నుంచి నేను లేవను!' అని బుద్ధుడు చేసుకున్న శపథమే మనందరికీ ఆదర్శం. అటువంటి పట్టుదల లేనిదే ఏకాగ్రత సాధ్యం కాదు.

**వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన! ।**

**బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ (గీత 2:41)**

ఏకాగ్రత గురించి వివరించిన ఈ శ్లోకం ఏ పరిస్థితిలో మన మనస్సు ఏకాగ్రతను సాధిస్తుందో వివరిస్తుంది. 'ఎవరి బుద్ధి అయితే గొప్ప ప్రయత్నంతో పనిచేస్తుందో వారి బుద్ధి ఏకాగ్రమై ఉంటుంది. అలా ప్రయత్నంతో పనిచేయని వారి మనస్సు అనేక శాఖలుగా విడిపోయి ఉంటుంది' అని ఈ శ్లోకానికి అర్థం. దీనినిబట్టి చూస్తే ప్రయత్నమే ముఖ్యం అని అర్థమవుతుంది. దానికే సంస్కృతంలో 'వ్యవసాయం' అనే మాటను ఉపయోగిస్తారు. వ్యవసాయం అంటే గొప్ప ప్రయత్నంతో పనిచేయడం. ఈ ప్రయత్నం అనే మాటను ఈ రోజుల్లో మనం సరిగా వాడడం లేదు. 'ప్రయత్నిస్తాము' అంటే 'కుదిరితే చేస్తాము' అన్న అర్థంలో వాడుతున్నాము. అది తప్పు. మన శక్తిని మొత్తం వెచ్చించి పని చేస్తే దానినే వ్యవసాయం అనీ, లేదా ప్రయత్నం అనీ అంటారు.

*"ఏ మనస్సు చక్కగా ఏకాగ్రమవ్వగలదో అదే విజయాన్ని సాధిస్తుందని తెలుసుకోండి! ఒకేసారి రెండువేల విషయాలను గురించి ఆలోచించే మనస్సు దాని శక్తిని చెల్లాచెదరు చేసుకుంటుంది"* అని స్వామీజీ వివరించారు.

అర్జునుడు చెట్టుమీది కొయ్య పక్షిని కొట్టిన కథలో ఒక గొప్ప అర్థం ఉంది. అర్జునుడు పక్షి తలను మాత్రమే చూశాడు. అతడి మనస్సు అనేక శాఖలుగా చీలిపోలేదు. తోటి వారి సంగతి చూడండి. వారు ఎన్ని కనిపిస్తున్నాయని చెపితే, వారి మనస్సు అన్ని భాగాలుగా చీలిపోయిందని మనం అర్థం చేసుకోవాలి. 'నాకు పక్షితో పాటు చెట్టు కొమ్మ కూడా కనిపిస్తోంది' అన్నవాడి మనస్సు రెండు ముక్కలై పోయిందన్నమాట. "...నాకు చెట్టు ఆకులు కూడా కనిపిస్తున్నాయి" అని చెప్పినవాడి మనస్సు మూడు ముక్కలై పోయింది. "..నాకు మీరు, ఇతరులందరూ కనిపిస్తున్నారు" అని గురువుతో చెప్పినవాడి మనస్సు అనేక ముక్కలైనట్టు మరి! కాబట్టి, ఎవరైతే గొప్ప ప్రయత్నంతో పనిచేస్తారో వారి మనస్సు గొప్ప ఏకాగ్రతను సాధిస్తుంది.



బుద్ధి అనేక శాఖలుగా చీలిపోవడాన్ని నిత్యజీవితంలో చూడవచ్చు. చదవడానికి కూర్చుంటే మనకు అమ్మ, నాన్న, అన్న, చెల్లి అందరూ గుర్తుకొస్తారు. ఇంట్లో ఉన్న టీవీ, స్కూటర్, క్రికెట్ బాట్, అన్న కొనుక్కున్న కొత్త సైకిలు – అన్నీ కనిపిస్తాయి. లేకపోతే నిన్ననే కొన్న కొత్త పెన్ను ఎంత బాగుందో ఇంకొకసారి చూడాలనిపిస్తుంది. ఇక ఏ ఆండ్రాయిడ్ సెల్‌ఫోనో ఆ చుట్టుప్రక్కల ఉంటే సరేసరి.

ఆపైన, క్రీడలలోనూ ఇది కనిపిస్తుంది. ఆటగాళ్ళు సాధన చేస్తున్నప్పుడు ఎంతో నైపుణ్యాన్ని కనబరుస్తారు. కానీ ఏదో ఒక పోటీకి వెళ్ళినప్పుడు, అక్కడ తోటి ఆటగాళ్ళను చూసి వాళ్ళతో తమను పోల్చుకున్నా, తాము గెలువగలిగే పతకాలను, తద్వారా వచ్చే పేరుప్రఖ్యాతులను, డబ్బును తలుచుకున్నా, వారి ఏకాగ్రత చిందరవందరైపోతుంది. దానితో తమ లక్ష్యాన్ని సాధించలేకపోతారు. అభ్యాసం చేసేటప్పుడు అన్నీ చక్కగా వచ్చినట్టే కనపడతాయి కానీ పరీక్షకు వెళ్ళేసరికి ఏదీ గుర్తుండదని చెప్పే విద్యార్థులు తమ మనస్సు దేని గురించి ఆలోచిస్తోందో గమనించుకోవాలి.

## 20. ఏకాగ్రతను సాధించడానికి కొన్ని ఆచరణాత్మక పద్ధతులు

ఏకాగ్రతను గురించి మనం ఇప్పటివరకూ కొన్ని విషయాలను నేర్చుకున్నాము. అయితే వాటికి తోడు మన దైనందిన జీవితంలో పాటించదగిన కొన్ని సూచనల్ని ఇప్పుడు తెలుసుకుందాము. ఈ సందర్భంగా ఒక ముఖ్య విషయాన్ని మనస్సులో పెట్టుకుంటే, మనస్సును స్వాధీనం చేసుకోవడం, ఏకాగ్రతను సాధించడం మరింత సులభ

మవుతాయి. అదేమిటంటే, *“చెట్టు చిన్నదిగా ఉన్నప్పుడు దాన్ని కంచె కట్టి రక్షించాలి. అదే పెద్దదయిన తర్వాత దానికి ఏనుగును కట్టివేసినా ఆపగలుగుతుంది!”* అని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పారు. కాబట్టి చిన్నతనంలోనూ, సరిపడి నంత ఏకాగ్రత అలవడనంతవరకూ, మనస్సును ప్రక్కదోవ పట్టించే విషయాలన్నింటికీ దూరంగా ఉండడమే మేలు.

**శారీరిక బలం!** బలమైన శరీరమే మానసిక ఏకాగ్రతకు మొదటిగా కావలసిందని ఇప్పటికే చెప్పుకున్నాం. పుష్టి కరమైన ఆహారంతోపాటు, వ్యాయామం, ఆటలు, యోగా సనాలు, ప్రాణాయామంతో శరీరాన్ని బలంగా చేసుకోవాలి.

**మనస్సును గమనించండి!** మన మనస్సులో ఏ ఆలోచనలు పరుగెడుతున్నాయో గమనిస్తూ, మనమే దాన్ని ఒక కంట కనిపెడుతూ ఉండాలి. మనస్సు మనదే అయినా దానినే మన మనస్సులోని మరొక భాగంతో గమనించడం సాధ్యమే. మనస్సును ఒక అల్లరి పిల్లవాడితో పోల్చవచ్చు. దానినెవరైనా గమనిస్తున్నారని గ్రహించినప్పుడు, అది అల్లరి మాని, మర్యాదగా నడచుకుంటుంది.

**ఒకసారి ఒక పనినే చేయాలి!** మనస్సుతో ఒకేసారి అనేక పనులు చేయడానికి ప్రయత్నించకూడదు. గొప్ప ఏకాగ్రత సాధించినవారు ‘మల్టీ-టాస్కింగ్’ చేస్తూ మనకు కనపడ వచ్చు కానీ, ఇంకా సరిగా ఏకాగ్రత అలవడనివారు అలా చేయడానికి ప్రయత్నించకూడదు. ముందు ఒకసారి ఒక పనిని చక్కగా చేయగలిగే స్థితికి వచ్చాక అప్పుడు ప్రయత్నిం చవచ్చు. నిజానికి, అష్టావధానం, శతావధానం చేసేవారు, అత్యున్నత స్థాయిలో, ఒకే సమయంలో అనేక విషయాలను

ఆలోచిస్తూ, సమస్యలను పరిష్కరిస్తూ కనిపిస్తారు. అయితే అలా చేయడానికి ఎంతో సాధన కావాలి.

**శరీర భంగిమ!** చదవడం అనేది నేలమీద కానీ, కుర్చీలో కూర్చుని కానీ చేయడం మేలు. నిలబడి చదివినా మంచిదే. మంచం మీద నడుం వాల్చి చదవడానికి ప్రయత్నిస్తే ముందుగానే నిద్ర ముంచుకు వస్తుంది. ఎందుకంటే ఆ భంగిమ నిద్రకు సంబంధించినది కదా! అంతేకాక, శరీరంలోని ప్రతి కదలికనూ గమనిస్తూ ఉండాలి. సాధారణంగా మన ప్రమేయం లేకుండానే గోళ్ళు గొరుక్కోవడం, ఒంటి మీది బట్టలు సర్దుకోవడం, జుట్టు సవరించుకోవడం మొదలైన పనులు చేస్తూ ఉంటాము. ఇలాంటి చేష్టల్ని మానాలి. అందుకు మాటిమాటికీ మనస్సుకు నచ్చచెప్పుకోవాలి. మన శరీరం ఏమి చేస్తున్నదో మనకే తెలియకుండా ఉంటే మన మనస్సు మన స్వాధీనంలో లేనట్టే కదా!

ఈ సందర్భంలో జెన్-విలుకాళ్ళ సాధన పద్ధతులను గుర్తుచేసుకోవాలి.

**నిర్ణీత సమయాలను ఏర్పరచుకోండి!** ప్రతి పనికీ ఒక నిర్ణీతమైన సమయాన్ని కేటాయించుకుని పనిచేసినప్పుడు మనస్సు దానంతట అదే ఆయా సమయాలలో ఆ పనుల మీద కేంద్రీకృతమవుతుంది.

**మనస్సును చెదరనీయకండి!** ప్రక్కన వినిపించే రకరకాల శబ్దాలు, కనిపించే మనుష్యులు, వస్తువులు, జంతువులు మన ఏకాగ్రతను దెబ్బతీస్తాయి. మనస్సును వాటి మీదకు పోనివ్వకూడదు. చేస్తున్న పని గురించి మనస్సుతో చెప్పి, తిరిగి దాని మీదే అది ఏకాగ్రమయ్యేలా చేయాలి.

**ఏకాంతం!** ఏకాంతంలో పనిచేయడం అలవాటు చేసుకోవాలి. మహాత్ములందరూ ఏకాంతంలో తమకు గొప్పస్ఫూర్తి లభిస్తుందని చెప్పినవారే. కానీ, ఈ యాంత్రిక యుగంలో ఏకాంతమే కరవైపోయింది. కానీ మనస్సు ప్రశాంతంగా, ఒకే విషయం మీద పనిచేయాలంటే దానికి ఏకాంతాన్ని కల్పించడం ఎంతైనా అవసరం.

**శ్వాసను గమనించండి!** మన మనస్సులో అలజడి కలిగినప్పుడు అది మన శ్వాసలో కనిపిస్తుంది. శ్వాసను త్వరగా తీసుకోవడం లేక నెమ్మదిగా తీసుకోవడం చేసినప్పుడు మన మానసికస్థితిలో తేడాలు వస్తున్నాయని గ్రహించవచ్చు. మన మనస్సును నిరోధించే శక్తి శ్వాసకు ఉంది. మనం గాలిని ఎలా పీల్చివదులుతున్నామో నిరంతరం గమనించడం ద్వారా మనస్సు నిరంతరం ఒకే స్థితిలో ఉండేలాగా చేయడమే కాక దానిని క్రమంగా మన స్వాధీనంలోనికి తెచ్చుకోవచ్చు.

**మధ్యమధ్యలో విశ్రాంతి!** ఆపకుండా పనిచేసే మనస్సు క్రమంగా తన ఏకాగ్రతను కోల్పోతుంది. ప్రతి గంట పనికీ ఐదు పది నిమిషాలు విశ్రాంతి తీసుకోవడం ద్వారా మనస్సును ఎక్కువసేపు ఏకాగ్రత చూపేలా చేయవచ్చు.

తగినంత నిద్ర కూడా మెదడు సరిగా పనిచేయడానికి అవసరం.

**మననం!** అంతవరకూ చేసిన పనిని మనస్సులో నెమరు వెయ్యాలి. ఇది మన జ్ఞాపకశక్తిని గొప్పగా పెంచే ఆయుధం. అంతేకాక, ఒకసారి ఒక విషయం చక్కగా మనస్సులో నాటుకున్న తర్వాత, దానికి సంబంధించిన ఇతర విషయాలన్నింటినీ కూడా నేర్చుకోవడానికి, అర్థం చేసుకోవడానికి గొప్పగా తోడ్పడుతుంది.

**సాంగత్యం!** ప్రత్యేకంగా కొన్ని పరిస్థితులలో, ప్రదేశాలలో, కొంతమంది వ్యక్తుల సమక్షంలో మన మనస్సు సరిగా నిలబడదు. అటువంటి పరిస్థితుల జోలికిపోకుండా ఉండడమే మేలు. ఏకాగ్రత లేకుండా, క్షణక్షణం పొరపాట్లు చేసే వారి సాంగత్యం మంచిది కాదు. మరొకవైపు, కొందరు గొప్ప వ్యక్తుల సమక్షంలో మన మనస్సు దానంతట అదే ఏకాగ్రమవ్వడాన్ని, ప్రశాంతమవ్వడాన్ని గమనించవచ్చు. గొప్ప ఏకాగ్రతను అలవరచుకున్న అటువంటి వ్యక్తుల సమక్షంలో కొంతసేపు గడపడం వలన మన మనస్సు కూడా ఏకాగ్రతను నేర్చుకుంటుంది.

## 21. ఏకాగ్రత కలిగిందని ఎలా తెలుస్తుంది?

అయితే మన మనస్సుకు ఏకాగ్రత కలిగిందని తెలుసుకోవడం ఎలా? కొన్ని సూచనలను బట్టి మన మనస్సుకు ఏకాగ్రత కలిగిందని మనమే గమనించవచ్చు. వాటిని గుర్తుంచుకుంటే మన మనస్సు ఏకాగ్రమవుతున్నదో లేదో, మన ఏకాగ్రత ఏమాత్రం పెరుగుతున్నదో గ్రహించవచ్చు.

1. మనం ఏదైనా పనిచేస్తున్నప్పుడు దానిలో నిమగ్నమైపోయి ఎంత సమయం గడచిపోయిందో తెలియనప్పుడు, మనకు ఆ సమయంలో మంచి ఏకాగ్రత కలిగిందని అర్థం చేసుకోవచ్చు. ఉదాహరణకు ఏదైనా పుస్తకం చదువుతున్నా, బొమ్మ గీస్తున్నా, ఎంత సమయం గడచిపోయిందో మనం గమనించము. తరువాత చూసుకుంటే చాలా సమయం గడచిపోయినట్టు తెలుస్తుంది. అలా జరిగినప్పుడు ఆ పనిని మనం ఏకాగ్రతతో చేశామని తెలుసుకోవచ్చు.

2. ఏకాగ్రతతో పనిచేస్తున్నప్పుడు గుండుసూది నేలమీద పడినంత చిన్న శబ్దమైనా అదేదో పిడుగుపడినట్టుగా మనకు

తోస్తుంది. దీనినిబట్టి కూడా మనకు ఏకాగ్రత కలిగిందని తెలుసుకోవచ్చు. మరొకప్రక్క, చక్కని ఏకాగ్రత కలిగిన స్థితిలో, ప్రక్కన ఎటువంటి శబ్దాలు అవుతున్నా అవి మనకు వినపడవు; ఎదురుగా ఉన్న మనుష్యులను, వస్తువులను చూసినా గమనించము.

3. ఏకాగ్రతతో ఏదైనా చదివినా, పని చేసినా, అది మనకు చక్కగా అర్థమవుతుంది, పూర్తిగా గుర్తు ఉంటుంది. ఎంత ఏకాగ్రత చూపితే, మన జ్ఞాపకశక్తి అంతగా పెరుగుతుంది కనుక ఆ రెంటికీ విడదీయలేని సంబంధం ఉంది.

జ్ఞాపకశక్తి అంటే ఏమిటో స్వామీజీ వివరించారు: *"మనం కలైడోస్కోప్‌ను తిప్పితిప్పి చూసినపుడు దానిలోని రంగు రంగుల గాజులు రకరకాల అమరికలలో పడుతూ ఉంటాయి కదా! అదే విధంగా, మనమేదైనా ఒక వస్తువును చూసినప్పుడు మన మెదడులోని కణాలు ఒక రకమైన అమరికలో అమరడం ద్వారా దాన్ని గుర్తుపెట్టుకుంటాయి. మళ్ళీ ఆ వస్తువును గుర్తుకు తెచ్చుకోవాలంటే మన మెదడు ఆ అమరికను తిరిగి పొందగలగాలి. దీన్నే మనం జ్ఞాపకశక్తి అని అంటాము. మనం ఎంత ఏకాగ్రతతో, సంకల్పశక్తితో ఒక విషయాన్ని నేర్చుకుంటే, ఆ అమరికను వెలికి తీయడంలో (అంటే గుర్తుచేసుకోవడంలో) మన మెదడు అంత విజయవంతమవుతుంది."* ఈ అమరిక దృఢంగా తయారై, మన జ్ఞాపకశక్తిని గొప్పగా పెంచడానికి ముందు అధ్యాయంలో చెప్పుకున్న 'మననం' కూడా తోడ్పడుతుంది. (సంకల్పశక్తి గురించి ముందుముందు చదువుతాము.)

4. ఏకాగ్రతతో పనిచేసినప్పుడు మనకు ఒక విధమైన ఆనందం కలుగుతుంది. చేస్తున్న పనిలో ఆనందం

కలుగుతూ ఉంటే దానిమీద ఏకాగ్రత కలిగిందని అర్థం. ఇక ఏకాగ్రత లేనప్పుడు, చేస్తున్న పనిని ఎప్పుడు మానేద్దామా అని ఆలోచిస్తాము!

5. కొన్నిసార్లు ఆడేటప్పుడు, కొన్ని పనులు చేసేటప్పుడు, చిన్నచిన్న దెబ్బలు తగులుతాయి. అయితే తగిలినప్పుడు వాటిని గమనించము. తర్వాత అవి నొప్పి పెడుతుంటే మనమే ఆశ్చర్యపోతాము. చేస్తున్న పని మీద ఏకాగ్రత వల్లనే ఆ గాయాన్ని, దాని నొప్పిని మనం గమనించలేదు.

6. ఏకాగ్రతతో చేసిన పని చూడచక్కగా ఉంటుంది. గిన్నెలు తోమినా, చేతివ్రాత వ్రాస్తున్నా, ఆట ఆడుతున్నా, బొమ్మలు గీస్తున్నా, ఏకాగ్రతతో చేసిన పని చాలా అందంగా తయారవుతుంది. చేసిన పని చక్కగా లేకపోతే దానిని ఏకాగ్రతతో చేయలేదని అర్థం.

7. ఏకాగ్రతతో చేసిన పని త్వరగా పూర్తవుతుంది.

8. ఏకాగ్రతతో పనిచేసేటప్పుడు మనం దేని మీద మనస్సును ఏకాగ్రం చేస్తున్నామో దాని లక్షణాలు మనకు అలవడతాయి. ఈ విషయం సంగీతం, నాటకం మొదలైన కళలలో ఎక్కువగా కనిపించినా, కంప్యూటర్ ప్రోగ్రామింగ్ లాంటి మిగిలిన విషయాలలో కూడా నిజమే.

9. ఇంకా ఉన్నతమైన స్థాయిలో ఈ ఏకాగ్రత ధ్యానంగా మారి, అలా ధ్యానిస్తున్న విషయంతో మనం తాదాత్మ్యం చెంది, అపరిమితమైన ఆనందాన్ని అనుభవిస్తాము. అంతే కాక, అటువంటి ధ్యానం మనకు అంతవరకూ అర్థం కాని విషయాలను కూడా అర్థమయ్యేలా చేస్తుంది, ఆధ్యాత్మిక ప్రగతికి దోహదం చేస్తుంది.

## 22. విద్యార్థి ఎలా ఉండాలి?

ఇంతవరకూ మనం ఏకాగ్రతకు సంబంధించిన అనేక విషయాలను తెలుసుకున్నాము. తిరిగి మనం మన కథానాయకుడైన అర్జునుడు చేసిన రకరకాల పనులను, వాటి ద్వారా మనం నేర్చుకోగలిగిన పాఠాలను చూద్దాము.

*ఒకసారి ద్రోణుడు శిష్యులతో కలిసి గంగానదికి స్నానానికి వెళ్ళాడు. నీటిలోకి లోతుగా వెళ్ళిన తర్వాత ఒక మొసలి ద్రోణుణ్ణి పట్టుకుంది. ద్రోణుడు తనని తాను రక్షించుకోగలిగినవాడే అయినా, 'ఈ మొసలిని చంపి నన్ను త్వరగా విడిపించండి' అని శిష్యుల్ని ఆదేశించాడు. ఇదంతా శిష్యుల్ని పరీక్షించడానికే! అయితే నీటిలో ఉన్న మొసలిని ఎలా మట్టుబెట్టాలో వారికి అర్థం కాలేదు. వారు ఆశ్చర్యంలో నుంచి తేరుకుని తమ ఆయుధాలు చేతిలోకి తీసుకునే లోపలే అర్జునుడు అయిదు తిరుగులేని బాణాలతో నీటిలో మునిగి ఉన్న మొసలిని కొట్టాడు. అది ద్రోణుణ్ణి విడిచిపెట్టి మరణించింది. అర్జునుడి నేర్పరితనాన్ని చూసి ద్రోణుడు ఎంతో సంతోషించాడు. తన పరీక్షలో నెగ్గినందుకుగాను అర్జునుడితో, "నాయనా! 'బ్రహ్మశిరోనామకం' అనే అస్త్రాన్ని ప్రయోగించడంతో పాటు, దాన్ని ఎలా ఉపసంహరించాలో కూడా నీకు ఉపదేశిస్తాను. నేర్చుకో! ఇది చాలా విశిష్టమైన అస్త్రం. దీనిని ధారణ చేయడం కూడా చాలా కష్టం. ఈ అసాధారణమైన అస్త్రాన్ని చీటికీమాటికీ ప్రయోగించకూడదు. అలా చేస్తే ఇది ప్రపంచాన్నే దహిస్తుంది. మనస్సునూ, ఇంద్రియాలనూ నిగ్రహించుకొని దీనిని ధారణ చెయ్యి. మరొకమాట విను! యుద్ధంలో శత్రువు ఎవరైనా నిన్ను బాధించినప్పుడు, అత్యవసర పరిస్థితులలో మాత్రమే, వారిని చంపడానికి నీవు ఈ అస్త్రాన్ని ప్రయోగించాలి, సుమా!" అని చెప్పాడు. అర్జునుడు వినయంతో అలాగే జాగ్రత్త వహిస్తానని మాట ఇచ్చి, ఆ గొప్ప అస్త్రాన్ని స్వీకరించాడు. "లోకంలో నీకు సాటిరాగల విలుకాడు ఎవ్వడూ ఉండడు!" అని ద్రోణుడు అర్జునుణ్ణి ఆశీర్వదించాడు.*

ఈ శ్లోకం మీకు తెలుసు కదా!

**సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై ।**
**తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై,**
**ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**



ఇది మనందరం నిత్యం చదివే అతి ప్రాచీనమైన శ్లోకం. ఉపనిషత్తులలో ఇది మనకు అనేక పర్యాయాలు కనిపిస్తుంది. గురువు, శిష్యుడు ఇద్దరూ కలసి చదివే ఈ శ్లోకానికి అర్థం ఏమిటంటే: “మనం ఇద్దరమూ (గురువు, శిష్యుడు) కలసి నేర్చుకోవాలి, కలసి అర్థం చేసుకోవాలి. మనం నేర్చిన విద్య మన ఇద్దరికీ బలాన్నీ, వీర్యాన్నీ, తేజస్సునూ ఇవ్వాలి. మన ఇద్దరి మధ్య ద్వేషం కలుగకుండా ఉండాలి. ముల్లోకాలకూ శాంతి కలుగుగాక!”

గురుశిష్యుల మధ్య సంబంధం ఎలా ఉండాలో ఈ శ్లోకం చక్కగా వివరిస్తుంది. గురువు ముందుగానే నేర్చుకుని

శిష్యుడికి నేర్పుతున్నప్పటికీ, గురుశిష్యులిద్దరూ అభ్యాసంలో భాగస్వాములే అని శ్లోకతాత్పర్యం. దానివల్ల ఇద్దరికీ శ్రేయస్సు కలుగుతుంది. అంతేకాక, వారిద్దరి మధ్య ద్వేషం కలుగకూడదని కూడా ఆ శ్లోకంలో చెప్పబడింది. ద్వేషం ఉన్నప్పుడు అధ్యయనం ఎలా సాగుతుంది? గురుశిష్యులు ఆ శ్లోకాన్ని అర్థం చేసుకుని ప్రవర్తించినపుడు విద్యావ్యవస్థ నిజమైన సార్థకతను సాధిస్తుంది.



ద్రోణుడిలాంటి సరియైన గురువు నిరంతరం శిష్యుడి యోగక్షేమాలనే కోరుకుంటాడు. అటువంటి గురువు పరుషంగా మాట్లాడినా అది శిష్యుడి మంచి కోసమే అవుతుంది. అటువంటి గురువు మనకు దొరికినప్పుడు అతడి మీద లేనిపోని అనుమానాలనూ, ద్వేషాన్నీ పెంచుకోకుండా అతడు చెప్పిన మాటను శిరోధార్యంగా భావించి విద్య నేర్చుకోవాలి. అటువంటి గురువును ప్రసన్నం చేసుకోగలిగినప్పుడు అతడు మనకు మరింత సంతోషంతో విద్యను బోధిస్తాడు. అది మనకే మంచిది కదా!

## 23. నేర్చుకోవాలన్న శ్రద్ధే అసలైన గురువు

*దాయాదుల మధ్య వైరమనేది లోకసహజం. దుర్యోధనుడికి పాండవులను చూస్తే చాలా అసూయగా ఉండేది. ఎలాగైనా సరే వారిని అణచివేయాలని నిరంతరం కుతంత్రాలు పన్నుతూ ఉండేవాడు. అంతేకాక, తమకన్నా ద్రోణుడు పాండవులకే ఎక్కువ నేర్పుతున్నాడని, ముఖ్యంగా అర్జునుడికి తమకు తెలియని రహస్యాలు బోధిస్తున్నాడనీ నిందిస్తూ, తమ గురువు అన్న గౌరవం కూడా లేకుండా, 'పాండవపక్షపాతి' అంటూ ద్రోణుణ్ణి తూలనాడాడు. ద్రోణుడు అది విని ఊరుకున్నాడు. అయితే, తాను నేర్పడం వల్లనే కాక అర్జునుడు తన స్వయంకృషి వల్లనే ఎక్కువ విద్య సాధిస్తున్నాడని వారికి నిరూపించాలనుకున్నాడు. మరుసటి రోజు ద్రోణుడు స్నానానికి గంగానదికి వెడుతూ, అర్జునుణ్ణి నూనె తెమ్మని వెనక్కి పంపివేశాడు. మిగిలిన శిష్యులకు కొత్త పాఠం నేర్పుతాను రమ్మని, ఒక అస్త్రాన్ని ఎలా ప్రయోగించాలో వివరించే ఒక శ్లోకాన్ని నేలమీద వ్రాసి, దానిని, దాని ప్రయోగవిధానాన్ని వారికి నేర్పి ఆ తర్వాత స్నానానికి వెళ్ళాడు. నూనె తీసుకువస్తున్న అర్జునుడు దారిలో నేలమీద వ్రాసివున్న శ్లోకాన్ని చూసి దాన్ని చదివి నేర్చుకుని, దాని ప్రకారం ఆ అస్త్రాన్ని ఎలా ప్రయోగించాలో కూడా నేర్చుకుని గురువు వద్దకు వెళ్ళాడు. ఆ తర్వాత ద్రోణుడు శిష్యులంద రినీ పరీక్షించినపుడు అర్జునుడు ఆ అస్త్రాన్ని కూడా ప్రయోగించి చూపాడు. ఎలా నేర్చుకున్నావని అడిగితే, అర్జునుడు నేలమీద వ్రాసివున్న శ్లోకాన్ని చదివి నేర్చుకున్నానని చెప్పినపుడు, మిగిలిన శిష్యులందరూ ఆశ్చర్యపోయారు.*

ఉత్తముడైన విద్యార్థి ఎవరు? ఎవరి మనస్సు నిరంతరం తాను చేపట్టిన చదువును మరింత చక్కగా ఎలా నేర్చుకో గలనా అని ఆలోచిస్తూ ఉంటుందో అతడే ఉత్తముడైన విద్యార్థి. అలాంటివాడు, ఎక్కడ నేర్చుకునే అవకాశం దొరికినా దానిని వదిలిపెట్టడు. ఇక, ఉత్తములైన గురువులు ఉత్తములైన శిష్యుల కోసం ఎదురుచూస్తూ ఉంటారు. ధనం, అధికారం ఎవరివద్ద ఉన్నాయన్న విషయాన్ని అటువంటి

గురువులు పట్టించుకోరు. శిష్యులలో వినయవిధేయతలు, అకుంఠితదీక్ష లాంటి లక్షణాలు ఉన్నాయా లేదా అని గమనిస్తారు. తన సొంతకుమారుడైన అశ్వత్థామను కూడా మించిపోతున్నా సరే, ద్రోణుడు అర్జునుడికే ఎక్కువ విద్యను నేర్పాడు కదా!

## 24. తయారుగా ఉండడమే విజయ రహస్యం

*ద్రోణుడు, ద్రుపదుడు బాల్యమిత్రులు. ఒకే గురువు దగ్గర విద్యను అభ్యసించారు. ద్రోణుడు బ్రాహ్మణకుమారుడు, ద్రుపదుడు రాకుమారుడు. వారిరువురూ విద్యాభ్యాసకాలంలో ఎంత ప్రాణస్నేహితులుగా ఉండేవారంటే, ద్రుపదుడు తాను రాజయ్యాక ద్రోణుడికి అర్ధరాజ్యం ఇస్తానని అంటూ ఉండేవాడు. విద్య పూర్తయ్యాక, ఎవరి త్రోవన వారు వెళ్ళిపోయారు. తండ్రి తర్వాత ద్రుపదుడు రాజయ్యాడు. అయితే ద్రోణుడు మాత్రం పేదరికంలో మగ్గిపోసాగాడు. ఏకంగా అర్ధరాజ్యమే ఇస్తానన్న చిన్ననాటి స్నేహితుడు ఇప్పుడు రాజయ్యాడు కనుక తప్పక తనకు సహాయం చేస్తాడని ద్రోణుడు భావించి వెళ్ళి ద్రుపదుడి సహాయం కోరాడు. అయితే గర్వం తలకెక్కిన ద్రుపదుడు నిండు సభలో ద్రోణుణ్ణి ఘోరంగా అవమానించి పంపివేశాడు. ఈ సంఘటన తర్వాత ద్రోణుడు ద్రుపదుడి మీద పగబట్టి ఎప్పటికైనా ప్రతీకారం తీర్చుకోవడానికి మార్గాలు వెదుకుతున్నాడు. ఆ సమయంలోనే కౌరవపాండవులకు గురువుగా చేరాడు.*

*ఇక పాండవులూ, కౌరవులూ అస్త్రవిద్యలో నిష్ణాతులు అయ్యారని నిశ్చయించుకొని ద్రోణాచార్యుడు తన శిష్యులందరినీ పిలిపించాడు. "నాయనలారా! మీ విద్యాభ్యాసం పూర్తి అయింది. మీరందరూ చక్కటి యుద్ధవీరులుగా తయారయ్యారు. ఇప్పుడు మీరు నాకు గురుదక్షిణ ఇవ్వాలి. పాంచాల రాజయిన ద్రుపదుణ్ణి యుద్ధంలో ఓడించి, బంధించి తీసుకురండి. ఇదే మీరు నాకు ఇవ్వగలిగిన గురుదక్షిణ!" అని వారితో చెప్పాడు. అందుకు వారు ఉత్సాహంగా ఒప్పుకుని, రథాలను ఎక్కి, ద్రోణాచార్యునితో కలసి బయలుదేరారు.*

వారంతా పాంచాల రాజ్యం నగర పొలిమేర చేరగానే అర్జునుడు బాగా ఆలోచించి ద్రోణాచార్యునితో, "గురువర్యా! ముందు కౌరవులను యుద్ధం చేయనివ్వండి! ద్రుపదుణ్ణి యుద్ధంలో ఓడించడం వీరి వల్ల కాదు! వీరి పరాక్రమ ప్రదర్శన ముగిసిన తర్వాత పాండవులమైన మేము ఐదుగురమూ యుద్ధం చేస్తాము!" అన్నాడు. ద్రోణుడు అందుకు అంగీకరించాడు.

మొదట కౌరవులు పాంచాల రాజధాని వైపు దూసుకుని పోసాగారు. ఆ వార్తను విన్న ద్రుపదుడు పెద్ద సైన్యంతో వచ్చి యుద్ధానికి దిగాడు. ద్రుపదుడి ధాటికి తట్టుకోలేక కౌరవులు వారి సేనతో సహా పారిపోసాగారు. ఆ స్థితిలో పాండవులు ద్రోణుడికి నమస్కరించి రథాలను ఎక్కి యుద్ధానికి బయలు దేరారు. అర్జునుడు ధర్మరాజును యుద్ధానికి రావద్దని వారించి, నకుల సహదేవులను తన రథచక్రాలకు రక్షకులుగా ఉండమన్నాడు. భీమసేనుడు గద పట్టి సేన ముందు నిలిచాడు. విజయగర్వంతో ఘోష పెడుతున్న ద్రుపదుడి సేన మీదకు పాండవులు విరుచుకుపడ్డారు.

ఒకవైపు అసమానమైన బాహుపరాక్రమం గల భీముడు ద్రుపదుడి సైన్యంలో పదాతిదళాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ నాశనం చేయ సాగాడు. మరొకవైపు అర్జునుడు అన్ని దిక్కులలోనూ కనిపిస్తూ, అశ్వదళా లనూ, గజసేనను, రథాలనూ నేలకూల్చుతూ ప్రళయకాలాగ్నిలాగా ప్రజ్వరిల్లాడు. అతడు బాణాలను సంధించడానికి, విడవడానికి మధ్య వ్యవధి కనిపించడం లేదు. అర్జునపక్షంలో అభినందనలూ, సింహనాదాలూ చెలరేగాయి. చివరకు, అర్జునుడు పాంచాల సైన్యాన్ని దాటుకుని ద్రుపదుణ్ణి చేరుకుని అతణ్ణి తన బాణాలతో ముంచెత్తాడు. మహాయోధుడైన ద్రుపదుడు కూడా అర్జునుణ్ణి బాణాలతో కొట్టసాగాడు. అర్జునుడు ద్రుపదుడి బాణాలన్నింటినీ తిప్పికొట్టి, అతడి విల్లును విరుగగొట్టి, ధ్వజాన్ని కూల్చివేసి, కత్తిని చేతబట్టి సింహనాదం చేసి, ఆ పాంచాలరాజు రథం మీదకు నిర్భయంగా దూకి, అతణ్ణి లోబరుచుకున్నాడు. ఇది చూసిన పాంచాల సైనికులు పారిపోసాగారు.

పాండవులు ద్రుపదుణ్ణి బంధించి ద్రోణాచార్యునికి కానుకగా సమర్పిం చారు. ద్రోణుడు గతాన్ని గుర్తు చేసుకుంటూ, "ద్రుపదా! సమవుజ్జీల మధ్యనే

*స్నేహం పొసగుతుందని గొప్పలు చెప్పి, నన్ను చిన్నచూపు చూశావు కదా! ఇప్పుడు నేను నీ రాజ్యాన్ని ఆక్రమించుకున్నాను. కాబట్టి నేను కూడా రాజునే! ఈ పోరాటాన్ని, ఓటమిని మనస్సులో పెట్టుకోక నన్ను నీ మిత్రునిగానే భావించు!" అన్నాడు. ద్రుపదుడు, "బ్రాహ్మణా! నీవంటి పరాక్రమవంతుడికి ఇంత ఔదార్యం ఉండడం ఆశ్చర్యకరం. నీతో శాశ్వతమైత్రిని కోరుతున్నాను!" అన్నాడు. పైకి మైత్రిని కోరినా, ద్రోణుడు చేసిన పరాభవం ద్రుపదుడి మనస్సులో మరింత ద్వేషాన్ని రగిలించింది. మరొకవైపు అర్జునుడి పరాక్రమాన్ని చూసి ఎంతో సంతోషించి, అతడితో బంధుత్వాన్ని ఏర్పరుచుకోవాలనుకున్నాడు.*

మనకున్న శక్తిని బట్టే మనం ఇతరులను అంచనా వేయగలం! యుద్ధానికి ముందు అర్జునుడు ద్రుపదుడి శక్తిని చక్కగా అంచనా వేసి దానికి తగ్గట్టుగా యుద్ధాన్ని నడిపాడు. అలాగే ద్రుపదుడు కూడా అర్జునుడి కౌశలాన్ని చక్కగా అంచనా వేశాడు. అతడు శత్రువుగా వచ్చి తననే ఓడించి నప్పటికీ, అతణ్ణే తన అల్లుడిగా చేసుకోవాలనుకున్నాడు.

అర్జునుడు మిగిలినవారికన్నా కష్టించి అభ్యాసం చేయడం ద్వారా ఎక్కువ విద్యను సాధించాడు. దానివల్లనే ద్రుపదుణ్ణి ఓడించగలిగాడు. ఏదైనా పని సాధించాలంటే, ముందుగా దాని కోసం తయారు కావాలి. ఎంతో పరిశ్రమతో ఆ పనిని చేయగల సమర్థతను సాధించాలి. అర్జునుడు కేవలం యుద్ధంలో నెగ్గాడన్నదే మనకు ముఖ్యమైన విషయం కాదు. ప్రక్కన నిలబడి చూసేవారికి అంతవరకే అర్థమవుతుంది. అయితే, అలా నెగ్గడానికి ముందు అతడు ఎంత సాధన చేసి, తయారయ్యాడో మనం గమనించాలి.

జీవితంలో పరీక్షాసమయం ఎక్కువసేపు ఉండదు. ఏడాది అంతా చదివినా పరీక్ష రాసేది కొన్ని గంటలే కదా. అయితే

జీవితంలో ఎదురయ్యే పరీక్షలు ముందుగా చెప్పి రావు. అవి ఎప్పుడు ఎదురైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండాలి. కాబట్టి నిరంతరం సన్నద్ధంగా ఉండడమే విజయ రహస్యం. అలా సన్నద్ధంగా ఉండాలంటే అమితమైన సాధన చేయాలి. మామూలుగా అవసరమనుకునే దానికన్నా, ముందు నుంచే, ఎన్నో గంటలు ఎక్కువ సాధన చేయాలి. ఆ విధంగా సాధన చేసినవాడికి గెలుపు దానంతట అదే దక్కుతుంది.

## 25. గుర్తింపు సాధించేది ఎలా?

సాధారణంగా మనందరికీ ఒక సందేహం ఉంటుంది. మన గురించి ప్రపంచానికి తెలియాలంటే ఎలా? కోరినంత డబ్బు సంపాదించాలంటే ఎలా? ఈ సందేహానికి సమాధానం ఏమిటంటే, అందరూ మనల్ని గుర్తించేలాగా చేయడమే! మరి, మనల్ని అందరూ గుర్తించాలంటే ఏమి చేయాలి? ఏదైనా విషయంలో మనకున్న సామర్థ్యాన్ని బట్టి మనల్ని లోకం గుర్తిస్తుంది. మనకు ఏ సామర్థ్యమూ లేకపోతే ఎవరైనా మనల్ని ఎందుకు గుర్తిస్తారు? ఎందుకు గుర్తించాలి? కాబట్టి, ఏదో ఒక విషయంలో మనకు పూర్తి నైపుణ్యం కావాలి. అది ఏ విషయమైనా ఫర్వాలేదు. అయితే, ఆ విద్యలో మనకు తెలియనిది అంటూ ఇక లేదు అనే విధంగా దాని మీద పట్టు సాధించాలి. అటువంటి నైపుణ్యమే అసలు బలం. అలాంటి నైపుణ్యాన్ని సాధించిన వాడికి ధనసంపదలే కాక, గొప్ప సంతృప్తి కూడా లభిస్తుంది.

***ద్రోణుడి చేతిలో అవమానం పొందిన ద్రుపదుడు, తన రాజ్యానికి తిరిగి వెళ్ళి, తనకు ద్రోణుణ్ణి చంపే శక్తిగల కొడుకు, అర్జునుణ్ణి వివాహం చేసుకునే కుమార్తె కావాలని గొప్ప యజ్ఞం చేశాడు. దాని ద్వారా అతడికి***

ధృష్టద్యుమ్నుడు అనే కుమారుడు, ద్రౌపది అనే కుమార్తె కలిగారు. ధృష్టద్యుమ్నుడు గొప్ప వీరుడిగా ఎదిగితే, ద్రౌపది అత్యంత సౌందర్యవతిగా, విద్యావంతురాలిగా ఎదిగింది.

ద్రుపదునికి మనస్సులో ద్రౌపదిని అర్జునుడికు ఇచ్చి వివాహం చేయాలని ఉంది. అయితే ద్రౌపదికి యుక్తవయస్సు వచ్చేసరికి పాండవులు లక్క ఇంటిలో కాలి మరణించారన్న వార్త వ్యాపించింది. దీనితో ద్రుపదుడు క్రుంగిపోయాడు. అయితే, పాండవులు మరణించారని అతడు నమ్మలేక పోయాడు. వారు ఎక్కడో అజ్ఞాతంగా ఉన్నారనీ, వారిని రప్పించడానికి ద్రౌపదికి స్వయంవరం ప్రకటించడమే మార్గమనీ భావించి, అలా ప్రకటన చేశాడు. ఇక మిగిలిన వీరుల నుంచి అర్జునుణ్ణి వేరు చేయడానికి అత్యంత బలవంతుడు మాత్రమే ఎక్కుపెట్టగల ఒక ధనస్సును తయారు చేయిం చాడు. ఆకాశంలో ఒక యంత్రాన్ని నిర్మించి దానిలో వేగంగా తిరిగే చేప బొమ్మను ఏర్పాటు చేశాడు. దాని ప్రతిబింబాన్ని నేలమీద ఏర్పాటు చేసిన చిన్న కొలనులో చూస్తూ, ఎత్తులో వేగంగా తిరుగుతున్న ఆ లక్ష్యాన్ని ఛేదించాలి. దాన్ని మామూలు విలుకాళ్ళు ఎవరూ కొట్టలేరు. "ఎవరైతే ఈ ధనస్సును ఎక్కుపెట్టి, ఆకాశంలో లక్ష్యంగా ఏర్పాటు చేసిన చేప యొక్క ప్రతిబింబాన్ని క్రింద ఉన్న నీటిలో చూస్తూ కొట్టగలరో, వారిని నా పుత్రిక వివాహమాడుతుంది!" అని ప్రకటించాడు. ద్రౌపది సౌందర్యం గురించి విన్న రాజులందరూ స్వయంవరంలో పాల్గొనాలని అక్కడకు వచ్చారు. చేప బొమ్మను లక్ష్యంగా పెట్టారు కాబట్టి అది మత్స్యయంత్రం అయింది.

కాలిపోతున్న లక్క ఇంటిలో నుంచి బయటపడ్డ పాండవులు బ్రాహ్మణ వేషాలు ధరించి అజ్ఞాతంగా దేశాలన్నీ తిరుగుతూ ద్రౌపదీ స్వయంవరం గురించి విని పాంచాలదేశం చేరారు. అక్కడ ఒక కుమ్మరి ఇంటిలో ఆశ్రయం పొంది, స్వయంవర మంటపానికి చేరారు. ఆ స్వయంవరానికి కృష్ణుడు బలరాముడితో వచ్చాడు. పాండవులు చనిపోలేదని తెలిసిన కృష్ణుడు, వారు స్వయంవరానికి రావడమే కాక, గెలుపొందుతారని కూడా ముందుగానే ఊహించాడు. క్షత్రియుల మధ్యలో కాక, బ్రాహ్మణుల మధ్యలో

*కొదమసింహాలలాగా కూర్చుని ఉన్న ఐదుగురు పాండవులనూ కృష్ణుడు బలరాముడికి చూపాడు. బలరాముడు వారిని చూసి సంతోషించాడు.*

*ద్రౌపదీస్వయంవరానికి వచ్చిన రాజులు ఒకరి తర్వాత ఒకరు వింటిని ఎక్కుపెట్టడానికి ప్రయత్నించారు. కొందరు ఆ వింటినే మోయలేక క్రిందపడిపోయారు. కొందరు ఎక్కుపెట్టబోయి దాని విసురుకు వెనక్కు పడ్డారు. అప్పుడు బ్రాహ్మణుల మధ్యలో, బ్రాహ్మణవేషంలో కూర్చుని ఉన్న అర్జునుడు లేచి ధనస్సును ఎక్కుపెట్టడానికి ఉద్యమించాడు. ఇది చూసి బ్రాహ్మణులందరూ ఆశీర్వాదాలు పలికితే, క్షత్రియులందరూ పెదవి విరిచారు. అర్జునుడు సకలవరప్రదాత అయిన సూర్యుడికి శిరస్సు వంచి నమస్కరించి ధనస్సును చేతిలోకి తీసుకున్నాడు. దాన్ని సునాయాసంగా ఎక్కుపెట్టి వరుసగా అయిదు బాణాలతో లక్ష్యాన్ని కొట్టాడు. అది నేలమీద పడింది. ద్రుపదుడు ఎంతో సంతోషించాడు. ద్రౌపది అర్జునుణ్ణి చేరి అతడి మెడలో పూలమాల వేసింది. అక్కడి బ్రాహ్మణులందరూ ద్రౌపదికీ, అర్జునుడికీ తమ ఆశీర్వచనాలు పలికారు.*

*అత్యంత సౌందర్యరాశి అయిన ద్రౌపదిని భార్యగా పొందాలని అక్కడకు వచ్చిన రాజులు తమకు అవమానం జరిగిందని భావించారు. క్షత్రియులనందరినీ ఆహ్వానించి, చివరకు ఒక బ్రాహ్మణుడికి ఇచ్చి వివాహం చేయడమేమిటని వారు ప్రశ్నించి, ద్రుపదుణ్ణి చంపడానికి బయలుదేరారు. భీముడు, అర్జునుడు ద్రుపదుడి మీద దాడికి సిద్ధపడిన వారిని అవలీలగా ఓడించి వెనక్కు పంపారు.*

అర్జునుడు సాధించిన కౌశలంవల్ల మహారాజయిన ద్రుపదుడే అతణ్ణి తన అల్లుడిగా చేసుకోవాలనుకున్నాడు. ఒకనాడు తననే ఓడించి, పరాభవించిన వాడయినప్పటికీ, అతణ్ణే కోరుకున్నాడు. కాబట్టి, మనం నేర్చుకున్న విద్య ప్రపంచంలో ఎక్కడకు వెళ్ళినా మనల్ని ఆదుకునే నిజమైన బంధువు అవుతుంది. శత్రువుల నుంచి కూడా అభిమానాన్ని సంపాదిస్తుంది.

## 26. శీలంతో కూడిన నైపుణ్యం కావాలి

*పరిస్థితులు విచిత్రంగా మలుపు తిరిగి, పాండవులు అయిదుగురూ ద్రౌపదిని వివాహం చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. ముందు వ్యతిరేకించినా, వ్యాసమహర్షిని సంప్రదించిన తర్వాత ద్రుపదుడు ఈ వివాహానికి అంగీకరించాడు. (ఆర్థిక కారణాలవల్ల అన్నదమ్ములు ఒకే స్త్రీని వివాహమాడే సంప్రదాయం ఇప్పటికీ హిమాలయ ప్రాంతాలలో కనిపిస్తుంది.) వివాహం తర్వాత పాండవులు ద్రౌపది కారణంగా తమ మధ్య విభేదాలు రాకూడదని గ్రహించి ఒక నియమం ఏర్పాటు చేసుకున్నారు. ఆ నియమం ప్రకారం ద్రౌపది ఒకొక్క సంవత్సరం ఒక్కొక్కరి దగ్గర నివసించాలి. సోదరులలో ఒకరు ఏకాంతంలో ద్రౌపదితో కలిసి ఉన్నప్పుడు వేరొకరు చూస్తే అతడు పన్నెండు నెలలు తీర్థయాత్ర చేయాలి. నారద మహర్షి సమక్షంలో ఈ నియమం ఏర్పాటు చేసుకుని దానిని ఖచ్చితంగా పాటించడం వల్ల అన్నదమ్ముల మధ్య విరోధం కలగలేదు.*

*అవి పాండవులు ఖాండవప్రస్థాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలించే రోజులు. ఒక రోజు ఒక బ్రాహ్మణుడు అర్జునుడి వద్దకు వచ్చి ఏడుస్తూ తన గోవులను దొంగలు అపహరించారనీ, త్వరగా వచ్చి రక్షించమనీ ప్రార్థించాడు. తన శరణుకోరి వచ్చిన వారి యొక్క, తన దేశ ప్రజల యొక్క సంరక్షణ రాజు బాధ్యత. అతడికి సత్వరం సహాయం చేయడం అర్జునుడి ధర్మం. అందుచేత, అర్జునుడు తన విల్లమ్ములను తీసుకోవడానికి వెళ్ళాడు. అయితే పాండవులు తమ ఆయుధాలు ఉంచే ఆయుధాగారంలో ఆ సమయంలో ధర్మరాజు ద్రౌపదితో ఏకాంతంగా ఉన్నాడు. నియమాన్ని అనుసరించి, అక్కడికి వెళ్ళినందువల్ల 12 నెలలు తీర్థ యాత్రలు చేయాల్సి వస్తుంది. అందువల్ల ఆ భవనంలో ప్రవేశించడానికి అర్జునుడు ఒక్క క్షణం తటపటాయించాడు. కానీ, 'సమయం మించిపోయిన తర్వాత చేసే సహాయం, సహాయం కాబోదు కదా!' కాబట్టి, తన సహాయం కోరి వచ్చిన నిస్సహాయుడైన మనిషికి సహాయం చేయకపోవడంవల్లనే తనకూ, తన వారికీ ఎక్కువ కీడు జరుగుతుందని భావించి అర్జునుడు ఆయుధాగారం*

*లోకి ప్రవేశించి ఆయుధాలను తీసుకుని, దొంగల్ని వెంబడించి హతమార్చి, గోవులను బ్రాహ్మణుడికి అప్పగించి నగరానికి తిరిగి వచ్చాడు. "తోటి మనిషికి సాయం చేయడానికి అవసరమైతే నేను నరకానికి పోవడానికి కూడా సిద్ధమే!" అని స్వామీజీ అన్నారు కదా!*

*ఆ తర్వాత అర్జునుడు ధర్మరాజుతో, "ప్రభూ! నా వల్ల వ్రతభంగం జరిగింది. మన నియమం ప్రకారం తీర్థయాత్రకు వెడతాను" అన్నాడు. ధర్మరాజు అర్జునుణ్ణి వారించడానికి ప్రయత్నించాడు. కానీ అర్జునుడు ఒప్పుకోలేదు. పన్నెండు నెలలు తీర్థయాత్రకు బయలుదేరి వెళ్ళాడు.*

ఈ సంఘటనలను బట్టి పాండవుల నియమనిష్ఠలను అర్థం చేసుకోవచ్చు. పాండవులు ఎంతటి సమర్థులయినా, ఏర్పరచుకున్న నియమాన్ని ఎంత నిష్ఠగా ఆచరించారో మనం గమనించాలి. మనిషి తాను ఇచ్చినమాటను నిలబెట్టు కోవాలి. అలా చేయనివాడు జీవచ్ఛవంతో సమానం. మనిషి తాను మనస్సులో ఏమి అనుకుంటాడో, ఏమి మాట్లాడతాడో దానినే చేతలలో చూపిస్తే దానినే శీలం అనవచ్చు.[3] శీలం లేనివాడు తన పనిలో కౌశలాన్ని సాధించడం కల్ల. ఎందు కంటే శీలం లేనివాడికి ఏకాగ్రత కుదరదు, సంకల్పశక్తి ఉండదు. ఇక అటువంటివాడికి కౌశలం ఎలా వస్తుంది?

సమాజం సజావుగా నడవడం కోసం కొన్ని నియమాలను ఏర్పరుస్తారు. వాటిని ప్రజలు నిక్కచ్చిగా పాటించాలి. ఈ రోజులలో సమర్థులైనవారు సరైన నడవడికి కట్టుబడకుండా అడ్డదారులు తొక్కడం మనం చూస్తూనే ఉన్నాము. కాబట్టి మనకు ఎంత నైపుణ్యం, సమర్థత, తెలివితేటలు ఉన్నా 'సరైన నడవడి' అంటే 'శీలం' లేకపోతే అవన్నీ బూడిదలో పోసిన పన్నీరే!

---

[3] **వ్యక్తిత్వం అంటే ఏమిటి? హనుమంతుడు : పేజీ 9-11**

## 27. ప్రలోభాలకు లొంగకూడదు

పాండవులు మయుడి సహాయంతో ఇంద్రప్రస్థం అనే గొప్ప రాజధానిని నిర్మించుకుని అందులో రాజ్యపాలన ప్రారంభించారు. అన్ని దిక్కులలోని రాజులను యుద్ధంలో ఓడించి, తమ సామంతులుగా చేసుకుని, ధర్మరాజు చేత రాజసూయయాగం చేయించారు. ఆ రాజులు లెక్కలేనన్ని కానుకలను, సంపదలను వారికి సమర్పించుకున్నారు. ధర్మరాజు లోకం లోని రాజులందరికన్న గొప్పవాడని పేరుతెచ్చుకున్నాడు. దుర్యోధనుడు ఇదంతా చూసి ఈర్ష్యతో రగిలిపోయాడు. వారి రాజ్యాన్ని ఎలాగైనా కాజేయాలని కర్ణుడితో, శకునితో కలసి కుతంత్రం పన్నాడు. జూదమాడ మని ధర్మరాజును ఆహ్వానించాడు. గెలిచిన వారికి రాజ్యం, ఓడినవారు పన్నెండు సంవత్సరాలు వనవాసం, ఆ తర్వాత ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయాలని నియమం పెట్టుకున్నారు. ఈ అజ్ఞాతవాసకాలం లో గుట్టు బయటపడితే తిరిగి 12 సంవత్సరాలు వనవాసం చేయవలసి ఉంటుంది. శకుని సహాయంతో పాండవులను మాయాజూదంలో ఓడించడమే కాక, దుర్యోధనుడు ద్రౌపదిని కూడా అవమానించాడు. ఇక రాజ్యాన్ని కోల్పోయిన పాండవులు వనవాసానికి బయలుదేరారు.

అయితే ఈ వనవాసం పూర్తయినా, మోసంతో కాజేసిన రాజ్యాన్ని దుర్యోధనుడు ఇస్తాడన్న నమ్మకం లేదు. అప్పడయినా యుద్ధం తప్పదు. అందుచేత, పాండవులు వనవాసం చేస్తూ రాగల యుద్ధం గురించి ఆలోచనలు చేశారు. ఒకనాడు ధర్మరాజు అర్జునుడితో, "అర్జునా! పూర్వం వృత్రాసురుడి దెబ్బకు తట్టుకోలేక దేవతలందరూ తమతమ అస్త్రాలను ఇంద్రుని దగ్గర దాచారు. వ్యాస మహాముని ప్రతిస్మృతి అనే విద్యను నాకు ప్రసాదించారు. నువ్వు దాని ద్వారా ఇంద్రుణ్ణి మెప్పించి ఆ అస్త్రాలను సంపాదించుకుని రా! రేపు జరగబోయే యుద్ధంలో దుర్యోధనుడి పక్షాన భీష్మ, ద్రోణ, కర్ణాదులు నిలిచి యుద్ధం చేస్తారు. వారిని గెలవడానికి ఆ దివ్యాస్త్రాలు అవసరం!" అన్నాడు.

*అర్జునుడు ఆ విద్యను నేర్చుకుని, అగ్నిని ఆరాధించి, ప్రదక్షిణం చేసి, కవచమూ, గాండీవమూ, అక్షయతూణీరాలు ధరించి, ధర్మరాజుకి, భీముడికి నమస్కారం చేసి, సెలవు పుచ్చుకుని బయలుదేరాడు. అరణ్యాలలో ప్రయాణం చేస్తూ దారిలో కనిపించిన హిమాలయాలనూ, గంధమాదనపర్వతాన్నీ దాటి ఇంద్రకీలాద్రి చేరాడు. అతడు వేగంగా నడుస్తుండగా, "ఆగు!" అన్న మాట వినిపించింది. ఆ నిర్జనప్రదేశంలో ఎవరు మాట్లాడారా అని అర్జునుడు చుట్టూ చూసేసరికి, ఒక చెట్టు నీడలో ఒక తపస్వి కనిపించాడు. అతడు పింగళవర్ణదేహంతో, బక్కచిక్కి ఉన్నప్పటికీ కూడా బ్రహ్మతేజస్సుతో వెలుగుతున్నాడు. అతడు అర్జునుడితో, "నాయనా, ఎవరు నువ్వు? యుద్ధానికి వెళ్ళేవాడిలాగా కవచమూ, ఆయుధాలూ ధరించి ఈ వనంలో ఎందుకు తిరుగుతున్నావు? ఇక్కడ గొప్ప గొప్ప తపస్వులు, ఇంద్రియాలను జయించినవారు ఉంటారు. ఇలాంటి చోట ఈ ఆయుధాలు ఎందుకు? వాటిని అవతల పారవెయ్యి!" అన్నాడు. అర్జునుడు అందుకు ఒప్పుకోక, "నేను ఆయుధాల కోసం తపస్సు చేయడానికి వచ్చాను!" అన్నాడు. దానివల్ల ప్రయోజనం లేదని అతడు ఎంత చెప్పినా అర్జునుడు తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. అప్పుడు ఆ తపస్వి, "నాయనా, నీ పట్టుదలకు సంతోషించాను. నేను ఇంద్రుణ్ణి. నీకు ఏమి వరం కావాలో కోరుకో!" అన్నాడు.*

*అర్జునుడు ఇంద్రుడికి నమస్కారం చేసి, "దేవా, నాకు దివ్యాస్త్రాలన్నీ ప్రసాదించు!" అని కోరాడు. దానికి ఇంద్రుడు, "వెర్రివాడా! నీకు అస్త్రాలెందుకు? స్వర్గాన్నే ఇస్తాను. హాయిగా సుఖించు!" అన్నాడు. "మా అన్నలూ, తమ్ములూ అరణ్యాలలో పడరానిపాట్లు పడుతుంటే, నేనొక్కణ్ణీ సుఖించనా? అలా చేయడం నా వల్ల కాదు. నేను క్షత్రియుణ్ణి! చచ్చిన తరువాత కూడా నా కీర్తి నిలిచి ఉండాలి. అంతేగానీ, నా సొంతానికి క్షణికమైన సుఖాలను పొందడం కోసం అపకీర్తి పాలు కాలేను!" అన్నాడు అర్జునుడు. ఇంద్రుడు అర్జునుడి మంచితనాన్ని మెచ్చుకుని, "నాయనా, నీ కోరిక నెరవేరాలంటే నీకు ముందు శివుని దర్శనం కావాలి. తపస్సు చేసి ఆయనను దర్శనం చేసుకో!" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.*

జీవితంలో మనకు చాలాసార్లు రెండు మార్గాలు ఎదురవుతాయి. ఒకటి వెంటనే మనకు ఆనందాన్ని ఇస్తుంది. కానీ దానిలో కలిగే ఆనందం కొంత మాత్రమే. రెండవది వెంటనే ఆనందాన్ని ఇవ్వదు కానీ కాలక్రమేణా చాలా ఎక్కువ ఆనందాన్ని ఇస్తుంది. ఎవరైతే మొదటిదాన్ని కోరకుండా తమ మనస్సును నిగ్రహించుకుని రెండవ దానికోసం వేచి ఉండ గలరో వారు జీవితంలో అద్భుతాలను సాధిస్తారు. మనం ఈ సందర్భంగా ఫిలిప్ జి. జింబార్డో (Philip G. Zimbardo) అనే ఒక మానసిక శాస్త్రవేత్త చేసిన పరిశోధనలను తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉంటుంది. అతడు నాలుగేళ్ళ వయస్సున్న పిల్లలతో ప్రయోగాలు చేశాడు. వారికి ఒక మిఠాయిని ఎదురుగా పెట్టి, "నేను బయటకు వెళ్ళి వస్తాను. నువ్వు కనుక నేను వచ్చేవరకూ ఈ మిఠాయిని తినకుండా ఉండగలిగితే ఇలాంటిదే ఇంకొకటి ఇస్తాను!" అని చెప్పాడు. అనేకమంది పిల్లలను పరీక్షించి, వారిలో ఎందరు ముందుగా ఇచ్చిన మిఠాయిని తినకుండా, తమను తాము నిగ్రహించుకున్నారో గమనించి, పదిహేనేళ్ళ తరువాత మళ్ళీ కలసి వారు జీవితంలో ఏ స్థాయిలో ఉన్నారో అధ్యయనం చేశాడు. వారిలో ఎవరైతే, మొదటి దానిని తినకుండా రెండవ మిఠాయి కోసం వేచివున్నారో వారు జీవితంలో మంచి స్థితిలో ఉన్నారు. తమను తాము నిగ్రహించుకోలేక వెంటనే మిఠాయిని తిన్నవారు జీవితంలో మంచి స్థితిని పొందలేకపోయారు. దీనినిబట్టి మనకు తెలిసేది ఏమిటంటే, నిగ్రహం అనేది మనం జీవితంలో అన్నిటికన్నా ముఖ్యంగా అలవరచుకోవలసిన లక్షణం.

నిజానికి, 'నిగ్రహించుకోవాలా, వద్దా' అన్న ప్రశ్న జీవితంలో మాటిమాటికీ ఎదురవుతూనే ఉంటుంది. పని చేయవలసిన క్షణంలో కష్టపడి పనిచేయకుండా సుఖంగా ఉండడాన్ని కోరుకుంటే అది మన మనస్సుల్ని దిగజారుస్తుంది. పనిచేయడానికి మొరాయిస్తున్న మనస్సును అదుపు చేసి, దానిచేత చక్కగా పని చేయిస్తే, ఆ తర్వాత కలిగే ఆనందం చాలా గొప్పదిగా ఉండడమే కాక మనల్ని గొప్ప వ్యక్తులుగా తయారుచేస్తుంది. అస్త్రాలను సాధించాలన్న ఆదర్శాన్ని చేపట్టి బయలుదేరిన అర్జునుడికి ఇంద్రుడే ఎదురై, "నీకు స్వర్గాన్నే ఇస్తాను! హాయిగా సుఖించు!" అని చెప్పడం అటువంటిదే. అయితే, ఇంద్రుడి మాట వినగానే అర్జునుడు పొంగిపోక, తాను ఎంచుకున్న ఆదర్శాన్నే కోరుకున్నాడు.

## 28. లక్ష్యాన్ని గురించే ఆలోచించండి! దానినే కలగనండి! దానినే జీవించండి!

***శివుణ్ణి ఆరాధించడానికి నిశ్చయించుకుని అర్జునుడు ముందుకు సాగాడు. దారిలో అతడికి మనోహరమైన వనం ఒకటి కనిపించింది. అక్కడి పూలచెట్లు చాలా అందంగా, సువాసనలు వెదజల్లుతున్నాయి. శివుడి కోసం తపస్సు చేయడానికి అది చాలా అనుకూలమైన ప్రదేశంగా అర్జునుడికి తోచింది. అర్జునుడు నారబట్టలు కట్టి నాలుగు నెలలు తపస్సు చేశాడు. దానితో అతడి శరీరంలోనుంచి దారుణమైన వేడి పుట్టి, వనమంతా పొగ చుట్టివేసింది. అది చూసి వనంలో ఉండే ఋషులు శివుడి వద్దకు వెళ్ళి, అర్జునుడి తపస్సు మానిపించమని బతిమాలారు. తాను అర్జునుడి కోరిక తీర్చబోతున్నాననీ, భయపడవద్దనీ శివుడు వారికి చెప్పాడు.***

జీవితంలో దేనినైనా సాధించాలంటే దాని కోసం గొప్ప ప్రయత్నం చేయాలి. "శక్తికొద్దీ ప్రయత్నిస్తే తప్ప ఏ పనినైనా

*సాధించడం అసలు కుదురుతుందా?"* అని స్వామీజీ మనల్ని ప్రశ్నించారు. అర్జునుడు పాశుపతాన్ని సాధించడమనే ఉదాహరణను చూస్తే, అది ఏకాగ్రతను సాధించడానికి ఒక పద్ధతి మాత్రమేనని తెలుస్తుంది. ఈ ఏకాగ్రత పది నిముషా లలో సాధించేది కాదు. దాని కోసం మనం చేసే పనిని వదలకుండా ప్రయత్నించాలి. ఈ పుస్తకం ప్రథమ భాగంలో ఏకాగ్రతను సాధించడం ఎలాగో మనం చదివాము. అర్జునుడు అదే విధంగా ఈశ్వరుడి కోసం తపస్సు చేశాడు. తపస్సు అంటే మనస్సును పూర్తిగా ఒకే విషయం మీద ఏకాగ్రం చేసి, ఆ విషయం పూర్తిగా అవగాహనకు వచ్చే వరకూ వదలకుండా, దాని మీదే నిలిపి ఉంచడం. అర్జునుడు ఆ తపస్సు ద్వారా తాను కోరుకున్న విద్యలన్నింటినీ నేర్చుకున్నాడు. స్వామీజీ తపస్సు చేయడం వెనుకనున్న అర్థాన్ని ఇలా వివరించారు. *"ప్రపంచంలోని విజ్ఞానమంతా ఏ విధంగా సంపాదించబడింది? మానసిక శక్తులను కూడగట్టి, "ఏకాగ్రం" చేయడం ద్వారా మాత్రమే ఇది సాధ్యపడింది. మనం గట్టిగా తట్టగలిగితే ఈ సృష్టి దాని రహస్యాలన్నింటినీ ఇచ్చి వేయడానికి సిద్ధంగా ఉంది. దానికి అవసరమైన దెబ్బను ఎలా వెయ్యాలో మనకి తెలిస్తే చాలు. "ఏకాగ్రత" ద్వారా ఆ దెబ్బ వేయడానికి కావలసిన బలం, శక్తి వస్తాయి. మానవ మేధాశక్తికి అంతు లేదు. అది ఎంత ఏకాగ్రమైతే, అంత శక్తి ఒకే విషయం మీద కేంద్రీకరించ బడుతుంది. అదే ఏకాగ్రతలోని రహస్యం!"* అని ఆయన చెప్పారు. ఒకసారి ఏదో ఒక పద్ధతిలో ఏకాగ్రతను సాధించిన తర్వాత అదే శక్తితో అన్ని విషయాలనూ నేర్చుకోవచ్చు.

## 29. పోరాడేవాడు ఏ ఆయుధంతోనైనా పోరాడతాడు

*ఋషులు వెళ్ళగానే శివుడు కిరాతుడి (వేటగాడి) వేషం, పార్వతి అతడి భార్యలాగా, ప్రమథులు వేటగాడి అనుచరులలాగా వేషాలు ధరించారు. వారందరూ అర్జునుడు తపస్సు చేస్తున్న వనంలో విహరించసాగారు. ఆ సమయంలో ఒక అడవి పంది అర్జునుణ్ణి చంపడానికి అతడి మీదకు రాసాగింది. అర్జునుడు విల్లూ, బాణాలూ తీసుకుని ఆ పందిని చంపబోయాడు. ఇంతలో కిరాతుడి రూపంలో ఉన్న శివుడు అర్జునుడితో, "ఓరే, ఆ పందిని నేను కొడతాను, నువ్వు కొట్టకు!" అన్నాడు. అర్జునుడు ఆ మాట లక్ష్యపెట్టక, పందిని బాణంతో కొట్టాడు. కిరాతుడు కూడా దాన్ని తన బాణంతో కొట్టాడు. ఇద్దరి బాణాలూ ఒకేసారి తగిలి ఆ పంది చనిపోయింది. అప్పుడు అర్జునుడు కిరాతుడితో, "ఈ నిర్జనవనంలో స్త్రీని వెంటబెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు? నన్ను చంపడానికి వచ్చిన పందిని నేను చంపుతుంటే నాతో సమంగా ఎందుకు బాణాలు వేశావు? ఇది వేటగాడి ధర్మం కాదు. ఇలా చేసినందుకు నేను నిన్ను చంపేస్తాను!" అన్నాడు. కిరాతవేషంలో ఉన్న శివుడు అర్జునుడి మాటలకు నవ్వి, "నేను ఆడవాళ్ళను వెంట తీసుకుని తిరుగుతున్నానని నీకెందుకు విచారం? ఇది మా ఆటవికుల ధర్మం. నాగరికంగానూ, సుకుమారంగానూ ఉన్న నువ్వు నిర్జనమైన ఈ అరణ్యంలో ఎందుకున్నావు? ఇక, ఈ పందిని ముందు కొట్టినవాణ్ణి నేను! నేను కొట్టిన పందినే నువ్వు కొట్టావు. బలముందన్న పొగరుతో నన్ను తప్పపడుతున్నావు. అంత దమ్ముంటే నాతో యుద్ధానికి రా!" అంటూ అర్జునుణ్ణి రెచ్చగొట్టాడు. అర్జునుడు అలిగి, కిరాతుడి మీద వరుసగా బలమైన బాణాలను వేశాడు. కాని కిరాతుడు వాటిని లక్ష్యపెట్టక, "ఇవేం బాణాలు? ఇంతకన్న మంచి బాణాలు లేవా? ఇంతకన్నా బాగా యుద్ధం చేయలేవా?" అన్నాడు.*

*అమోఘమైన తన బాణాలను లక్ష్యపెట్టని ఈ కిరాతుడు ఎవరో మారువేషంలో ఉన్న మహనీయుడని అర్జునుడికి అనుమానం కలిగింది. మామూలు కిరాతుడైతే ఎప్పుడో మరణించి ఉండేవాడని అర్జునుడు అను*

*కున్నాడు. అయినా, అర్జునుడు వెనుకాడకుండా కిరాతుని మీద బాణవర్షం కురిపించాడు. కొద్దిసేపట్లో అక్షయతూణీరాలే ఖాళీ అయిపోయాయి. అగ్నిదేవుడు ప్రసాదించిన అక్షయమైన బాణాలు ఖాళీ అయిపోవడం అర్జునుడి అనుమానాన్ని మరింత బలపరిచింది. అయినప్పటికీ అతడు వెనకాడక తన గాండీవం మొనతో ఆ కిరాతుణ్ణి పొడిచి చంపబోయాడు. గాండీవం మాయమయింది.*

*అయినా వదలకుండా, అర్జునుడు కత్తిదూసి దానితో కిరాతుణ్ణి కొట్టాడు. కత్తి ముక్కముక్కలై కిందపడింది. ఇక నిరాయుధుడైన అర్జునుడు కిరాతుడి మీదకు చెట్ల కొమ్మలు విసిరాడు. రాళ్ళు రువ్వాడు. ఏది ప్రయోగించినా కిరాతుడు చలించలేదు. చివరికి అర్జునుడు కిరాతుడితో కలియబడి అతణ్ణి పిడికిళ్ళతో పొడిచాడు. కిరాతుడు కూడా అర్జునుణ్ణి పిడికిళ్ళతో పొడిచాడు. కిరాతుడి దెబ్బలకు అర్జునుడికి స్పృహ తప్పింది.*

అర్జునుడు ముందు బాణాలు ప్రయోగించినా, అవి అయిపోయేసరికి యుద్ధం మానేయలేదు. చేతికి ఏది దొరికితే దానితో యుద్ధం చేశాడు. అర్జునుణ్ణి చూసి మనం నేర్చుకోవలసిన విషయాలలో ఇది ఒకటి. పరిస్థితులు అంతగా తనకు అనుకూలించకపోయినా అర్జునుడు యుద్ధం మానలేదు. జీవితం కూడా ఆ యుద్ధం లాంటిదే. పరిస్థితులు మనకు నచ్చకపోయినా, సానుకూలంగా లేకున్నా, చేపట్టిన పనిని వదలకుండా చేయాలి.

భర్తృహరి నీతిశతకం[4]లోని ఈ పద్యాన్ని చూడండి!

**ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారుఁ బూసెజ్జపై,**
**నొకచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,**
**బొకచోఁ బొంత ధరించు, నొక్కొక్కతతిన్ యోగ్యాంబరశ్రేణి, లె**
**క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.**

---

[4] భర్తృహరి సుభాషితములు పుష్పాంజలి పేజీ : 142

చేపట్టిన పనిని సాధించే విషయంలో కార్యసాధకుడు నడచుకునే తీరు ఇలా ఉంటుంది. శయనించడానికి పూల పాన్పు లభించినా, కటిక నేలపై నిద్రించవలసి వచ్చినా లెక్కచెయ్యడు. దొరికితే వరి అన్నాన్ని భుజిస్తాడు, లేకపోతే పచ్చి కాయగూరల్ని, కందమూలాల్ని తిని సరిపెట్టుకుంటాడు. ఒక్కొక్కసారి విలువైన బట్టలు ధరిస్తాడు, లేని పక్షంలో బొంత ధరిస్తాడు. ఇలా కష్టం, సుఖం లెక్క చెయ్యకుండా అనుకున్నపనిని సాధించడానికి కార్యసాధకుడు ఉద్యమిస్తాడు.

## 30. తన పనిని సరిగా చేసేవాణ్ణి స్వర్గమే వెతుక్కుంటూ వస్తుంది!

*అర్జునుడు స్పృహ తెలిసి లేస్తూనే తాను అర్చించే శివలింగానికి పూలు అర్పించి, మనస్సును పూర్తిగా మహేశ్వరుడి మీదే లగ్నం చేసి ప్రార్థించాడు. ఆ తర్వాత కళ్ళు తెరచి చూసేసరికి, తాను శివుడికి అర్పించిన పూలు కిరాతుడి తల మీద కనిపించాయి. అర్జునుడికి మొదట ఆశ్చర్యమూ, తరువాత సంతోషమూ కలిగాయి. తాను ఇంతసేపూ యుద్ధం చేసిన కిరాతుడే శివుడని గ్రహించి అర్జునుడు అతడి కాళ్ళమీదపడి తన అజ్ఞానాన్ని క్షమించమని వేడుకుంటూ, పలు విధాల స్తుతించాడు. అప్పుడు శివుడు పార్వతితో సహా తన నిజరూపంలో దర్శనమిస్తూ, "అర్జునా! నీవంటి శూరుడు మూడు లోకాలలో మరొకడు లేడు. నీ భక్తికి మెచ్చాను. తేజస్సులో నువు నా అంతటి వాడివి" అన్నాడు. అంతేకాక, అర్జునుణ్ణి కౌగిలించుకుని, అతడి చెయ్యి పట్టుకుని, "అర్జునా! నీ కోరికలేమిటో చెప్పు, తీర్చుతాను!" అన్నాడు.*

*"మహేశ్వరా! భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనాదులతో యుద్ధం రాబోతోంది. ఆ మహావీరులను జయించడానికి నాకు దివ్యాస్త్రాలు కావాలి. అనుగ్రహించు!" అని అర్జునుడు అర్థించాడు. శివుడు అర్జునుడితో, "నా శక్తికి ప్రతిరూపమైన పాశుపతాస్త్రాన్ని నీకు ఇస్తాను. నీవు ఆ అస్త్రాన్ని పొందడానికి అన్నివిధాలా తగినవాడివి!" అంటూ, పాశుపతాస్త్రాన్ని ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహారం చేయాలో మంత్రసహితంగా*

*తెలిపాడు. గాండీవమూ, అక్షయతూణీరాలు అతడికి తిరిగి లభించాయి. శివపార్వతులు అదృశ్యమయ్యారు.*

*అర్జునుడికి ఎక్కడలేని శక్తీ వచ్చినట్టయింది. ఈశ్వరదర్శనంతో పాటు, అపూర్వమైన పాశుపతాస్త్రం లభించింది. ఈశ్వరుడి స్పర్శ చేత అతడి శరీరం పవిత్రమయింది. అదే సమయంలో లోకపాలకులైన యమ, వరుణ, కుబేరులు తమ భార్యలతో సహా, అర్జునుడు ఉన్న చోటికి వచ్చి, తమ అస్త్రాలు అతడికి ఇచ్చారు. ఇంద్రుడు మాత్రం అర్జునుణ్ణి స్వర్గానికి ఆహ్వానించి, అక్కడ అతడికి దివ్యాస్త్రాలు ఇస్తానని వెళ్ళిపోయాడు.*

*అర్జునుడి కోసం ఇంద్రుడి రథం వచ్చింది. దానికి సారథియైన మాతలి, "అర్జునా, నీ కోసం ఇంద్రుడు ఈ రథం పంపాడు. ఆయన దేవతలతోను, గంధర్వులతోనూ, ఋషులతోనూ, అప్సరసలతోనూ కొలువు దీరి, నీ రాక కోసం ఎదురు చూస్తున్నాడు," అన్నాడు. ఇంద్రుడి రథం ఎక్కడం మాట అటుంచి, దానిని తాకటానికైనా, తనకు అర్హత లేదేమోనని అర్జునుడికి అనిపించింది. అయినా తన పితృసమా నుడైన ఇంద్రుడి ఆహ్వానాన్నే ఆజ్ఞగా భావించి, ముందు మాతలిని ఎక్కమని, తరువాత తాను ఆ రథానికి గౌరవంతో నమస్కరించి, ఎక్కాడు. ఆకాశమార్గంలో ఎదురైన పూర్వపు రాజులూ, యుద్ధాలలో మరణించిన శూరులూ ఎవరెవరైనదీ వివరిస్తూ మాతలి రథాన్ని అమరావతీ నగరం చేర్చాడు. దేవతలు అతడికి ఎదురేగి రాగా, గంధర్వులూ, సిద్ధులూ, అప్సరసలూ అతడికి మంగళోపచారాలు చేశారు. నారదుడు మొదలైన దేవర్షులు ఆశీర్వదించారు. అనేక ప్రాకారాలు దాటి 'సుధర్మ'మని పిలువబడే ఇంద్రసభకు చేరి, ఇంద్రుడికి ప్రణామం చేశాడు. ఇంద్రుడు అతణ్ణి లేవదీసి కౌగలించుకుని, సింహాసనం మీద తన పక్కనే కూర్చోపెట్టుకున్నాడు. తన అంశతో జన్మించిన అర్జునుణ్ణి మళ్ళీమళ్ళీ చూస్తూ మురిసిపోయాడు. అర్జునుడు స్వర్గంలో వివిధ దేవతాస్త్రాల ప్రయోగ, ఉపసంహారాలు పూర్తిగా నేర్చుకున్నాడు.*

స్వర్గానికి ఆహ్వానించబడడానికి అర్జునుడు చేసినది ఏమిటి? తన పనిని మానకుండా చేయడమే. ముందుగా

---

ఇంద్రుడు పెట్టిన పరీక్షలో నెగ్గాడు. ఈశ్వరుడి కోసం గొప్ప తపస్సు చేశాడు. ఆపైన, మహాశక్తిమంతుడైన ఈశ్వరుడితోనే యుద్ధం చేశాడు. ఆ యుద్ధం మధ్యలో బహుశా అర్జునుడికి, 'ఇతగాడెవడో చాలా శక్తిగలవాడు, నేను ఇతడితో పోరాడి గెలువలేనేమో!' అని తోచివుండవచ్చు. అయినా, అతడు వెనక్కు తగ్గలేదు. తన దగ్గరవున్న ఆయుధాలు అన్నీ విఫల మయినా, తన శరీరంలో శక్తి ఉన్నంతసేపూ పోరాడుతూనే ఉన్నాడు. ఈశ్వరుడు కూడా, అర్జునుడు కోరిన వెంటనే వరాలు ఇచ్చెయ్యలేదు. అతణ్ణి అన్ని విధాలుగానూ పరీక్షిం చాడు. తాను ఇచ్చే వరాలను పొందడానికి తగిన అర్హత, సమర్థత అతడికి ఉన్నాయని నిశ్చయించుకున్నాకే అతడికి వరాలు ఇచ్చాడు. ఇలా పరీక్షలన్నింటిలోనూ నెగ్గి, అర్జునుడు స్వర్గానికి అర్హత సాధించాడు.

నిజానికి, మనలో ఎంతమంది స్వర్గానికి నిచ్చెనలు వేయ ట్లేదు? పెద్ద ఉద్యోగాలలో, పదవులలో ఉన్నట్లు కలగడనం లేదు? "ఉట్టి కెగరలేనమ్మ స్వర్గాని కెగిరిందట!" అని సామెత. మన రోజువారీ జీవితంలో చేసే పనులు ఉట్టికి ఎగరడం లాంటివే. అంటే సామాన్యమైనవి. అయినా వాటిని మనం ఎంతో జాగ్రత్తగా, సక్రమంగా చేయాలి. వాటి కోసం ఎంత కష్టించాలో అంతా కష్టించాలి. కోరిన లక్ష్యాన్ని స్వర్గంతో పోలిస్తే, దాన్ని చేరే ప్రయాణంలో అనేక కష్టాలు ఎదురవుతాయి. అది ప్రకృతి మనల్ని పరీక్షించే పద్ధతి. ఆ పరీక్షలను చూసి మనం పోరాటం మాని, పారిపోకూడదు. అప్పుడే మనం కోరిన స్వర్గం, అంటే మనం కోరిన ఉన్నత స్థానం మనకు దక్కుతుంది.

---

## 31. మన శీలమే మనకు శ్రీరామరక్ష

*అస్త్రవిద్యతో పాటు, ఇంద్రుడు చిత్రసేనుడు అనే గంధర్వుడి దగ్గర అర్జునుడికి సంగీతమూ, నృత్యమూ నేర్పించాడు.*

అర్జునుడు, "నాకు ఈ సంగీతనృత్యాలు ఎందుకు?" అని అడగలేదు. తన వంటి యోధుడికి అవి నేర్చుకోవడం చిన్నతనం అవుతుందని అనుకోలేదు. ఇంద్రుడి మాట శిరసావహించి నేర్చుకోవడానికి సిద్ధపడ్డాడు. అర్జునుడిలో మనం నేర్చుకోవలసిన మంచి లక్షణాలలో ఇది ఒకటి.

*స్వర్గంలో అప్సరస అయిన ఊర్వశికి అర్జునుడి మీద మోహం కలిగి, ఒక నిండువెన్నెల రాత్రి అర్జునుడి విడిదికి వెళ్ళింది. అద్భుతంగా సింగారించు కుని, సువాసనలు గుబాళిస్తూ రాత్రివేళ తన విడిదికి వచ్చిన ఊర్వశిని చూసి అర్జునుడు అదిరిపడి, ఆమె పాదాలకు భక్తితో మొక్కి, "తల్లీ, నీ రాకకు కారణమేమిటి? నీకు నేనేమి సేవ చేయగలను?" అని అడిగాడు. ఊర్వశి తాను వచ్చిన పని చెప్పింది. అర్జునుడు చెవులు మూసుకుని, "అమ్మా! నువ్వు నాకు కుంతీదేవి లాగానూ, ఇంద్రుని భార్య అయిన శచీదేవి లాగానూ, తల్లిలాంటి దానివి. మా వంశానికి మూలపురుషుడైన పురూరవుడికి భార్యవు. నేను నిన్ను తల్లిగానే భావిస్తున్నాను!" అన్నాడు. దానికి ఊర్వశి, "అర్జునా! ఈ దేవలోకంలో పద్ధతులు వేరుగా ఉంటాయి. మీ భూలోకంలో ఉన్నట్టుగా ఇక్కడ వావివరసలు ఉండవు. అందుచేత లేనిపోని అనుమానాలు పెట్టుకోక నాతో సుఖించు!" అన్నది. అర్జునుడు ఆమెతో, "అమ్మా, మీరు దేవతలు! మీరు ఏది చేసినా తప్పులేదన్న మాట నిజం. కానీ నేను మానవమాత్రుణ్ణి. అందుచేత మీరు చేసే పనులు నేను చేయలేను. నువ్వు నాకు తల్లిలాంటి దానివి! నా మీద ఇతర భావాలు పెట్టుకోక, నన్ను నీ కొడుకులాగా చూసుకో!" అన్నాడు.*

అర్జునుడి శీలం ఎంత గొప్పదో ఇక్కడ మనకు తెలుస్తుంది. కర్ణుడు, అశ్వత్థామ, దుశ్శాసనుడు, సైంధవుడు మొదలైనవారు కూడా యుద్ధవిద్యలో గొప్ప నిపుణులే.

వారితో పోల్చినప్పుడు అర్జునుడికి గొప్పతనం అతడి శీలసంపద వల్లనే కలిగిందని మనకు అర్థమవుతుంది. *"చూడండి! డబ్బు మనల్ని రక్షించదు; పేరు మనల్ని రక్షించదు; ప్రఖ్యాతి మనల్ని రక్షించదు; పాండిత్యం కూడా మనల్ని రక్షించలేదు; మన శీలం మాత్రమే కోటగోడల లాంటి కష్టాలను కూడా ఛేదించి ముందుకు సాగిపోతుంది! శీలమొక్కటే మనల్ని రక్షించగలిగేది!"* అని స్వామీజీ చెప్పారు. మంచి శీలం, నడవడిక ఉన్నవాడి మనస్సు స్థిరంగా నిలబడి, ఏకాగ్రత సాధించగలుగుతుంది. శీలం లేనివాడి మనస్సు అన్ని దిక్కులకూ పారిపోతూ ఉంటుంది.

***అయితే ఊర్వశికి ఆ మాటలు రుచించలేదు. తన ఆశను నీరుగార్చిన అర్జునుడి మీద ఆమెకు ఆగ్రహం కట్టలు తెంచుకుంది. ఆమె అర్జునుడితో, "ఓయీ! నేను స్త్రీని! స్వేచ్ఛగలదాన్ని! నా అంతట నేను నిన్ను మోహించి వస్తే, నన్ను తృణీకరించావు. అందుచేత నిన్ను నపుంసకుడివిగా మారిపొమ్మని శపిస్తున్నాను. పేడివై, అంతఃపురంలో ఆడవాళ్ళ మధ్య ఆటపాటలతో కాలక్షేపం చేస్తూ ఉండిపో!" అని శపించి, విసవిసా వెళ్ళిపోయింది. అర్జునుడు చాలా కలవరపడ్డాడు. తాను చేసిన మంచి పనికి ఇటువంటి వ్యతిరేకమైన పరిణామం వచ్చిందేమిటని దిగులుపడ్డాడు. మర్నాడు చిత్రసేనుడు రాగానే అతడితో, గడచిన రాత్రి ఊర్వశి తన వద్దకూ రావటమూ, తాను ఆమె కోరికను తోసిపుచ్చటమూ, ఆమె తనను శపించి వెళ్ళిపోవటమూ వివరించి చెప్పాడు.***

## 32. సంకల్పశక్తి - ఏకాగ్రత

ఊర్వశిలాంటి స్త్రీని కూడా అర్జునుడు కాదనగలిగాడు. దీనినే ఆత్మసంయమనం అంటారు. ప్రలోభాలకు లొంగ కుండా ఉండడమే - అంటే ఆత్మనిగ్రహమే - అసలు

నేర్పరితనం, పౌరుషం. తనను తాను నిగ్రహించుకునేవాడు చేతకానివాడు కాదు. జీవితంలో మనకు నిత్యం అనేక ప్రలోభాలు ఎదురవుతూ ఉంటాయి. ప్రలోభం అంటే ఏమిటి? మన మనస్సును బలంగా ప్రక్కదోవ పట్టించేదే ప్రలోభం. మానవులకు ప్రకృతి సహజంగానే కోరికలు కొన్ని ఉంటాయి. వాటిని ధర్మబద్ధంగా తీర్చుకోవాలనుకోవడం తప్పు కాదు. అయితే, మనస్సులో కలిగే కోరికలన్నీ మంచివి కావని అందరికీ తెలుసు. అందుచేత సాధారణంగానే అటువంటి కోరికలు తీరకపోయినా మనం ఏమీ అను కోము. ఇకపోతే, కొన్ని కోరికలను నలుగురూ ఏమంటారో అన్న భయంతో బయటపెట్టము. అయితే ఆ కోరికలు పూర్తిగా చనిపోవు. ఎప్పుడైతే వాటికి ఒక అవకాశం దొరుకుతుందో, అవి మళ్ళీ రగులుకుంటాయి. అందుచేతనే ఈ 'అవకాశం' అనేది మనల్ని ఎంతటి ప్రలోభానికైనా గురిచేయగలదు. *"అవకాశాలు మహా గొప్ప నీతిమంతుణ్ణి కూడా మోసగాడిగా మార్చివేయగలవు సుమా!"* అని స్వామీజీ మనల్ని హెచ్చరించారు.

ఒక విద్యార్థి ఒక గదిలో కూర్చుని ఉన్నాడు. అతడికి మరునాడు పరీక్ష ఉంది. అందుకోసం చదువుతూ ఉన్నాడు. అప్పుడు అతడు చదువకపోతే మరునాడు పరీక్షలో అనుకున్న లక్ష్యాన్ని సాధించలేకపోవడం తథ్యం. కానీ ఆ గదిలోనే ఒక టీవీ ఉంది. ఆ రోజు మంచి క్రికెట్ మాచ్ జరుగుతోంది. అతడికి క్రికెట్ అంటే ప్రాణం. అతడు టీవీ చూస్తూ కూర్చున్నా అడిగేందుకు అక్కడెవరూ కాపలా లేరు. అప్పుడు అతడేమి చేస్తాడు? క్రికెట్ చూస్తాడా? లేకపోతే దాని జోలికి పోకుండా చదువుకుంటాడా? క్రికెట్ చూసినా

అడిగేందుకు ఎవరూ లేరు కదా! అటువంటి సమయంలో అతడు ఆ అవకాశానికి లొంగిపోయి, క్రికెట్ చూస్తే, ఆ కాసేపు ఆనందించినా, తర్వాత పరీక్షలో దెబ్బతిని అంతకు పదిరెట్లు బాధపడవలసి వస్తుంది. అతడు చేయవలసిన పని చదవడం కాబట్టి, అదే చేయాలి. ఎవరూ చూడకపోయినా సరే చేయకూడని పనిని చేయకూడదు. ఇందుకోసం అతడు తన మనస్సుకు నచ్చచెప్పి, అది చేయవలసిన పని చేసేలాగా చేశాడనుకోండి! దానినే సంకల్పశక్తి అంటారు. అతడికి టీవీ చూసే అవకాశం దొరికినా అతడు అందుకు లొంగిపోలేదు. అదే సంకల్పశక్తి! ఒక అవకాశం దొరికినప్పుడు ఆ అవకాశం వెంట పారిపోయే మనస్సు, మాటిమాటికీ పారి పోవడానికి అలవాటుపడి, మరొక అవకాశం ఎదురైనప్పుడు అటు పారిపోతుంది. ఇలా అటూయిటూ పారిపోయే మనస్సుకు ఏకాగ్రత ఎలా కలుగుతుంది? అందువలన ప్రలోభాలు పొడసూపే ప్రదేశాలను, సమావేశాలను మనం ఉద్దేశ్యపూర్వకంగా తప్పించుకోవడమే మేలు.

"*విద్యాభ్యాసం అంటే ఏమిటి? పుస్తకాలు చదవడమా? కాదు. రకరకాల విషయాల గురించి తెలుసుకుని ఉండడమా? అది కూడా కాదు. దేని అభ్యాసం వల్ల మన సంకల్పశక్తి యొక్క ప్రవాహం, వ్యక్తీకరణ మన స్వాధీనం లోకి వచ్చి, ఫలప్రదమవుతాయో దానినే విద్యాభ్యాసం అనాలి!*" అని స్వామీజీ నిర్వచించారు. దీనిని బట్టి, 'చదువు' అంటే సంకల్పశక్తిని పెంపొందించుకోవడమేనని మనకు అర్థమవుతుంది. సంకల్పశక్తిని గురించి తెలుసుకుంటే ఏకాగ్రతను సాధించడం మరింత సులభమవుతుంది.

అయితే, ఇప్పటికే మనందరికీ ఎంతో కొంత సంకల్పశక్తి ఉంది. ఇప్పటివరకూ మనం జీవితంలో ఏ కొద్దిపాటి విజయాన్ని సాధించినా దానికి కారణం మనలో ఉన్న సంకల్పశక్తే. అయితే ఈ శక్తిని నిరంతరం అభ్యాసం చేయడం ద్వారా మరింతగా పెంపొందించుకోవచ్చు.

సంకల్పశక్తి అంటే ఏమిటో కొద్దిమాటల్లో అర్థం చేసుకుందాము. ప్రపంచంలో మనకు మంచి కలిగించేవి కొన్ని ఉంటాయి. అవి కలిగించే మంచిని 'శ్రేయస్సు' అంటాము. కొన్ని మనకు సుఖాన్ని ఇచ్చేవి ఉంటాయి. ఆ సుఖాన్ని 'ప్రేయస్సు' అంటాము. సాధారణంగా మనకు శ్రేయస్సు నిచ్చేవి మనకు రుచించవు సరికదా వాటిని చేయాలంటే మనకు ఇష్టం ఉండదు. కానీ ప్రేయస్సునిచ్చే పనులను చేయడానికి ఎగబడతాము. అయితే, ఈ పనులు ముందు సుఖంగా తోచినా తర్వాత ఎక్కడలేని కష్టాలనూ కొనితెస్తాయి, జీవితాన్ని విషాదంలో ముంచుతాయి. కాబట్టి సుఖంగా ఉండాలన్న కోరిక విడిచిపెట్టి, మనకు శ్రేయస్సు ను కూర్చే పని మీద మనస్సు పెట్టి పనిచేయాలి. ముందు కష్టంగా తోచే ఈ పనులే మనకు తర్వాత పరిపూర్ణమైన సుఖాన్ని ఇస్తాయి. ఇలా చేయడానికి మనకు తోడ్పడే శక్తే సంకల్పశక్తి. (ఇంతకు ముందు మనం చదివిన ఫిలిప్ జి. జింబార్డో ప్రయోగాలను ఇక్కడ గుర్తు చేసుకోవచ్చు.)

సంకల్పశక్తి కొరవడితే మనిషి ఎలా తయారవుతాడో చెప్పే కథ ఒకటి ఉంది. ఒకసారి ఎవరో దుర్యోధనుణ్ణి అడిగారట – "నీవు ఎందుకు ఇలాంటి దుర్మార్గపు పనులు చేస్తూ ఉంటావు?" అని. దానికి దుర్యోధనుడు మనందరం గుర్తుపెట్టుకోవలసిన సమాధానాన్ని ఇచ్చాడు: "నాకు

ధర్మమేదో తెలుసు! కానీ ధర్మమార్గంలో పనిచేయలేను. నాకు అధర్మమేమిటో తెలుసు! కానీ అధర్మమైన పనులు చేయకుండా ఉండలేను!"

ప్రపంచంలో అత్యధికుల పరిస్థితి కూడా ఇలాగే ఉంటుందేమో అనిపిస్తుంది. మనకు మంచి ఏమిటో తెలిసినా చేయము. ఏది తప్పో తెలిసినా చేయకుండా ఉండలేము! మనందరకూ చదవాలని తెలుసు – కానీ చదవ లేము. కష్టపడితే ఫలితం దక్కుతుందనీ, కష్టపడనిదే ఫలితం రాదనీ తెలుసు – కానీ కష్టపడము. టీవీలతో, సోషల్ మీడియాలతో సమయం వృథా అవుతుందని తెలుసు. కానీ ఆ పనులు మానుకోలేము. వృత్తి పనులు చేసేవారు, సకాలంలో పనిచేసి ఇవ్వకుండా కష్టమర్లను తమ చుట్టూ తిప్పుకుంటూ ఉంటారు. వారు మానుకోలేకుండా ఉన్న దురలవాట్లో, దుర్వ్యసనాలో అందుకు కారణం. ఈ స్థితి మారాలంటే సంకల్పశక్తిని పెంపొందించుకోవడమే మార్గం.

## 33. సంకల్పశక్తిని పెంపొందించుకోవడం ఎలా?

*"ఇప్పటివరకూ చేసుకున్న అలవాట్లే ఈనాటి మన వ్యక్తిత్వాన్ని నిర్మించాయి. కాబట్టి, ప్రస్తుతపు అలవాట్లను మార్చుకోవడం ద్వారా మాత్రమే మన వ్యక్తిత్వాన్ని మార్చుకో గలుగుతాము, మెరుగుదిద్దుకోగలుగుతాము!"* అని స్వామీజీ స్పష్టం చేశారు. కాబట్టి మన దురలవాట్లను మార్చుకోవడం ద్వారా సంకల్పశక్తిని చక్కగా పెంపొందించుకోవాలి. ఇక ఆ శక్తిని ప్రయోగించినపుడు, అనుకున్న పనిని సాధించ గలుగుతాము. మంచి అలవాట్ల గురించి చెప్పేదేమీ లేదు కానీ దురలవాట్లను మార్చుకోక తప్పదు.

ఈ సంకల్పశక్తి ఎలా పనిచేస్తుందో తెలుసుకుందాము. దీనిలో రెండు భాగాలున్నాయి. ఒక భాగం మనస్సు అయితే, రెండవది దైవత్వం. ఈ దైవత్వం మనలోనే ఉంది. మనస్సు, దైవత్వాల సమ్మేళనమే సంకల్పశక్తి. మనం సంకల్పశక్తిని ప్రయోగించిన ప్రతిసారీ, అంటే చేయవలసిన పనిని చేయనని మొరాయిస్తున్న మనస్సును అదుపు చేసి, దానిచేత చేయించిన ప్రతిసారీ, మనలోని దైవత్వాన్ని ప్రయోగిస్తా మన్నమాట. ఇది కూడా అభ్యాసమే. దీనిద్వారా మనలోని దైవశక్తి పెరుగుతుంది – అంటే సంకల్పశక్తి పెరుగుతుంది.

చాలాసార్లు మనం చేయవలసిన పని చేయాల్సి వచ్చేసరికి మన ఉత్సాహం నీరుకారిపోతుంది, చేయాలనిపించదు. మరొక వైపు చేయకూడని పని ఏదో మనకు చాలా సుఖాన్నిచ్చేదిలాగా కనపడడమే కాక దాని చేయకుండా మనల్ని మనం ఆపుకోలేము. దీనికి తోడు మనలోని బద్ధకం, ఈర్ష్య, అసూయ, ద్వేషం, కామం, కోపం, లోభం, అతినిద్ర మొదలైన దుర్గుణాలు కూడా మనం చేయవలసిన పని చేయకుండా అడ్డుపడుతూ ఉంటాయి. వాటన్నింటినీ వదిలించుకోవడానికి మార్గం అభ్యాసమే. మాటిమాటికీ మనలోని బద్ధకాన్ని వదిలించుకుని, పనిలోకి దిగాలి. అంతే కాక, అర్జునుడిలాంటి బలమైన శరీరం ఉన్నవాడే తన సంకల్పశక్తిని వినియోగించుకోగలుగుతాడు. బలహీనులకు సంకల్పశక్తి కల్ల. ఊర్వశి లాంటి అప్సరస వచ్చి ఎదురుగా నిలబడినా సరే ఆమె కోరికను అంగీకరించకూడదని అర్జునుడికి తెలుసు. అలా అంగీకరించకుండా ఉండడాన్ని అతడు తన సంకల్పశక్తి ద్వారా సాధించాడు.

---

సంకల్పశక్తిని ప్రయోగించడం వల్ల మనకు కలిగే ప్రయోజనమేమిటో స్వామీజీ ఇలా వివరించారు: *"మన మనస్సులో కలిగే ద్వేషం ద్వారా, చెడుతనం ద్వారా, మనం చూపే ప్రతి ప్రతిక్రియ మన మనస్సు యొక్క శక్తిని అంతగా వృథా చేస్తుంది. మనస్సులో కలిగే చెడు ఆలోచనలను, ద్వేషంతో చేసే పనులను కనుక మనం అదుపు చేసుకుంటే, తద్వారా మనలో గొప్ప శక్తి నిక్షిప్తమవుతుంది. మనల్ని మనమే అలా అదుపు చేసుకున్నప్పుడు మనమేదో కోల్పోతున్నామని అనుకోనవసరం లేదు. ద్వేషాన్నీ, కోపాన్నీ మనం అదుపు చేసిన ప్రతిసారీ, దానికి సమానమైన శక్తి మనలో నిద్ర మేలుకుని, మనకు మేలు చేస్తుంది. మనలో ఆ శక్తి ఉన్నతమైన దివ్యశక్తిగా తయారవుతుంది!"*

ఒక శ్లోకాన్ని చూడండి!

**మాతృవత్ పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్ ।**
**ఆత్మవత్ సర్వభూతాని యః పశ్యతి స పండితః ॥**

**పరస్త్రీలను తన తల్లిగానూ, ఇతరుల డబ్బును మట్టిపెళ్ళతో సమానంగానూ, అన్ని జీవులను తనతో సమానంగానూ ఎవడు చూస్తాడో వాడే నిజమైన పండితుడు అని ఈ శ్లోకానికి అర్థం.**

ఈ శ్లోకంలో చెప్పిన సత్యాన్ని అర్థం చేసుకుని, జీవితంలో పాటిస్తే మనకు సంకల్పశక్తి పూర్తిగా అబ్బినట్లే. సంకల్పశక్తి అంటే ఏమిటో, దాని ఎలా పెంపొందించుకోవాలో టూకీగా మనం నేర్చుకున్నాం. దీన్ని పట్టుదలతో అభ్యాసం చేసినప్పుడు గొప్ప ఏకాగ్రత కలుగుతుంది. ఇక మనం జీవితంలో సాధించలేనిదేమీ ఉండదు.

## 34. శాపాలను వరాలుగా మార్చుకోగలగాలి!

*అర్జునుణ్ణి ఊర్వశి శపించిన వార్త ఇంద్రుడి వద్దకు చేరింది. నిజానికి, అర్జునుడి వద్దకు ఆమెను వెళ్ళమని ప్రోత్సహించింది ఇంద్రుడే! జరిగిన పరిణామానికి ఇంద్రుడే ఆశ్చర్యపోయి, అర్జునుడితో, "అర్జునా, నువ్వు నిజంగా ఇంత ఆత్మనిగ్రహం కలవాడివని నేను అనుకోలేదు. ఇటువంటి వారు మహర్షులలో కూడా అరుదుగా ఉంటారు. ఊర్వశి శాపానికి భయపడకు. మీరు ఒక ఏడాదిపాటు అజ్ఞాతవాసం చేయవలసి ఉన్నది గదా. అప్పుడీ శాపాన్ని అనుభవించు. అందువల్ల నీకు మేలే జరుగుతుంది. ఆ ఏడాది పూర్తికాగానే ఊర్వశి శాపం తీరిపోయేలా ఆ శాపఫలాన్ని నేను తగ్గిస్తున్నాను. అంతేకాక చిత్రసేనుడి వద్ద నీవు నేర్చుకున్న సంగీతనృత్యాలు కూడా అజ్ఞాతవాసంలో ఉపయోగపడతాయి!" అంటూ ఊరడించాడు.*

జీవితంలో అనేకసార్లు మనం చేసే మంచి పనులకు కూడా వ్యతిరేకమైన పరిణామాలు కలుగుతూ ఉంటాయి. ఈ ప్రపంచం తీరే అంత. అందుచేతనే ఫలితాలను బట్టి పని చేయడమనేది మంచి పద్ధతి కాదు. మన జీవితంలో దేన్ని ఆదర్శంగా ఎంచుకుంటామో దాన్ని అనుసరించి పని చేయాలి. ఆ మార్గంలో కలిగే ఫలితాలు ఎలాంటివైనా చేపట్టిన ఆదర్శాన్ని మనం వదలిపెట్టకూడదు. ముందుగా ఒకటి రెండుసార్లు ఓటమి పాలైనా, లేదా కోరిన ఫలితాలు కలుగక పోయినా, కౌశలాన్ని సాధించడానికి మనం చేసే ప్రయత్నాన్ని విడువకూడదు. మనకు చెడు ఫలితంగా తోచినది బహుశా మనకు ఇంకొక మంచి దారిని చూపడానికి కానీ, మనకు మరింత అనుభవాన్ని ఇవ్వడానికి కానీ కావచ్చు. అదే విధంగా ఊర్వశి శాపమే అజ్ఞాతవాసంలో అర్జునుడికి వరంగా మారింది కదా!

***ఇంద్రుడి మాటలతో తృప్తిపడి అర్జునుడు చిత్రసేనుడి సాంగత్యంలో స్వర్గంలో కొంతకాలం గడిపాడు. అనంతరం దేవేంద్రుడు తన రథం మీద అర్జునుణ్ణి పాండవులు ఉన్న చోటికి పంపాడు. పాండవులు అర్జునుణ్ణి చూసి బ్రహ్మానందం పొందారు. అర్జునుడు అన్నలకు నమస్కరించి, తమ్ములను కౌగలించుకుని తాను సంపాదించిన దివ్యాస్త్రాల గురించి వారికి వివరించాడు.***

## 35. కష్టాలను ఎలా ఎదుర్కోవాలి?

'పాండవులు మహాయోధులు కదా? అయినా అడవుల పాలయ్యారు ఎందుకు?' అని మనకు అనుమానం రావచ్చు. సృష్టిలోని విచిత్రం అదే! తలుచుకుంటే పాండవులు అప్పుడే కౌరవుల్ని మట్టుపెట్టేవారు. కానీ అలా జరగలేదు. ధర్మరాజు మాటను కాదనలేక భీమార్జునులు, నకులసహదేవులు, ద్రౌపది వనవాసం చేశారు.

కష్టాలు కావాలని ఎవరూ కోరుకోరు. అయినా సరే, ఏదో వొక సమయంలో కష్టాలపాలవని వారు ఉండరు. కష్టాలే లేని స్థితి ఎక్కడా ఉండదు. మరి ఈ కష్టాల వల్ల ప్రయోజనం ఏమన్నా ఉందా? ఉంది. కష్టాల గురించి స్వామీజీ ఇలా చెప్పారు: *"మీలో ఏవొక్కరికీ ఏ చిన్న కష్టమైనా కలగకూడదన్నదే నా హృదయపూర్వకమైన కోరిక. అయినప్పటికీ, కష్టాలు మాత్రమే మనకు ఈ జీవితపు అగాధాలలో దాగి ఉన్న అర్థమేమిటో తెలియజెపుతాయి. అవును! కష్టాల కడలిలో మునిగిన క్షణాలలోనే అంతవరకూ మూతబడివున్న ద్వారాలు తెరుచుకుని, అనేకానేక జ్ఞానకాంతి పుంజాలు మన జీవితాన్ని ప్రకాశమయం చేస్తాయి."* కాబట్టి కష్టాలు మనలోని శక్తిని మరింతగా వెలికితీస్తాయి. అరణ్యవాసమే భీమా

ర్జునులు తమ శక్తియుక్తులను పెంపొందించుకునే ముల్లుకర్ర లాగా పనిచేసింది. భీముడు హనుమంతుణ్ణి, అర్జునుడు శివుణ్ణి కలుసుకోవడం ద్వారా గొప్ప శక్తిని సంపాదించారు! అదేవారిని రాబోయే మహాసంగ్రామానికి సన్నద్ధుల్ని చేసింది.

ఇక్కడ మనం ఒకటి రెండు విషయాలు నేర్చుకోవచ్చు. ముందుగా భీమార్జునులు తమ రాజు అయిన ధర్మరాజు పట్ల చూపిన విధేయత. విధేయత చూపలేని వాడు ఎప్పటికీ నాయకుడు కాలేడు. మనకు ఎంత ఆత్మగౌరవం ఉంటుందో అంతే విధేయత కూడా ఉండాలి. మాయాజూదసమయం లో భీమార్జునులకు ధర్మరాజు మీద కొంత కోపం కలిగినా దాన్ని అణచివేసుకుని తమ మహారాజు అయిన అతడి పట్ల తిరుగులేని విధేయతను చూపారు.

రెండవది: 'ఈ అరణ్యంలో ఏమి చేస్తాములే!' అని నిస్పృహలో పడిపోకుండా పాండవులు మరింత శక్తిని సంపాదించేందుకు ప్రయత్నించడం మనకొక గొప్ప గుణపాఠం. పనిచేసేందుకు పరిస్థితులు సానుకూలంగా లేవని మనలో చాలామంది పెదవి విరుస్తూ ఉంటారు. కానీ అది సరి కాదు. డబ్బు విషయం కూడా అంతే. తమ వద్ద ధనం లేదు కాబట్టి తామేమీ చేయలేమని చాలామంది వాపోతూ ఉంటారు. లేకపోతే, "నాకేదో శని పట్టింది. ఇక నేను ఇంతే!" అంటూ ఉంటారు. ఇవన్నీ కూడా బద్ధకంతో చెప్పే మాటలే. మనిషి తానున్న స్థితిగతులపట్ల వెగటు చెంది, తన స్థితిని మెరుగుపరచుకోవడానికి నడుం బిగించినపుడు, క్రమంగా ప్రతికూల పరిస్థితులు కూడా చక్కబడతాయి. "మనిషి ధనం లేక చెడిపోడు కానీ గుణం లేక చెడిపోతాడు!" అని సామెత. గుణమున్న మనిషి తనను తానే ఉద్ధరించుకుంటాడు.

కాబట్టి, కావలసినదేమిటంటే, మనం నడుం బిగించడమే! "డబ్బు మనుష్యుల్ని తయారు చేయదు! మనిషే డబ్బును తయారుచేస్తాడు! ఈ ప్రపంచమంతా మనిషి యొక్క శక్తి తోనూ, ఉత్సాహంతోనూ, విశ్వాసంతోనూ నిర్మించబడింది" అని స్వామీజీ ఘంటాపథంగా చెప్పారు కదా!

## 36. పరిస్థితులకు అనుగుణంగా నడచుకోవడమే నేర్పరితనం

*ఇక పాండవుల అరణ్యవాసం ముగిసింది. ఇక వారు ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేయవలసి ఉంది. అందుకు వారు ఒక రహస్య సమావేశం జరిపి విరాటరాజు పరిపాలించే మత్స్యదేశంలో అజ్ఞాతవాసం గడపాలని నిర్ణయం తీసుకున్నారు. ధర్మరాజు, "నేను పాచికలు బాగా ఆడగలను. 'కంకుభట్టు' అనే పేరుతో విరాటరాజు వద్ద పాచికలు ఆడుతూ అతడికి వినోదం కలిగిస్తూ కాలం గడుపుతాను!" అని చెప్పాడు. భీముడు తాను 'వల్లవుడు' అనే పేరుతో వంటలు చేస్తూ విరాటరాజు కొలువులో ఉంటానని చెప్పాడు. నకులుడు 'దామగ్రంథి' అనే పేరుతో గుర్రాలకు శిక్షణ ఇచ్చేవాడు గానూ, సహదేవుడు 'తంతిపాలుడు' అనే పేరుతో గోవులను సంరక్షించే వాడిగా చేరతామన్నారు. ద్రౌపది తనకు స్త్రీల అలంకరణలో మంచి కౌశలం ఉందనీ, అందువలన 'సైరంధ్రి' అనే పేరుతో విరాటరాజు పట్టపురాణి అయిన సుధేష్ణకు ఇష్టసఖిగా ఉంటాననీ పాండవులకు చెప్పింది.*

*అప్పుడు అర్జునుడు, "అన్నయ్యా! ఊర్వశి శాపాన్ని ఇంద్రుడు ఈ అజ్ఞాతవాసకాలంలో వినియోగించుకోమని ఆదేశమిచ్చాడు. ఈ ఏడాది కాలంపాటు నేను నపుంసకుడిగా ఉంటాను. విరాటరాజ సభలో నేను పేడినని చెపుతాను. నా శిరోజాలను జడగా అల్లుకుని 'బృహన్నల' అని పేరు పెట్టుకుంటాను. విరాటరాజు అంతఃపుర స్త్రీలకు గీతాలూ, నృత్యాలూ, రకరకాల వాయిద్యాలలోనూ శిక్షణ ఇస్తాను. విరాటరాజుతో, 'నేను ఇంతకు*

ముందు ధర్మరాజు అంతఃపురంలో ద్రౌపదీదేవికి పరిచారికగా ఉండేదాన్ని' అని చెపుతాను!" అంటూ తాను ఎలా అజ్ఞాతంలో ఉండబోతున్నాడో వివరించాడు. ప్రపంచంలో అత్యుత్తమ విలుకాడు, పరమశివుణ్ణి ప్రత్యక్షం చేసుకున్నవాడు, మహేంద్రుడి సింహాసనం మీద కూర్చున్నవాడు - ఇప్పుడు పేడిగా జీవితం గడపవలసి వచ్చింది!

అర్జునుడు అందమైన రూపంతో, స్త్రీల అలంకారాలు, పొడవైన కుండలాలు, బంగారు గాజులూ ధరించి, శిరోజాలు విదుల్చుకుంటూ, ఏనుగువంటి నడకతో విరాటుడి సభలోకి ప్రవేశించి, తాను పేడినని చెప్పకుని ఆశ్రయం కోరాడు. అతణ్ణి చూసి విరాటరాజు ఆశ్చర్యంతో, 'ఓయీ! నీవు పేడివా? చూడబోతే మహాబలశాలిలాగా ఉన్నావు. చేతులకున్న శంఖవలయాల మీద బంగారుగాజులు ధరించావు. జుట్టు విరబోసుకుని కుండలాలు, పూలమాలలు ధరించావు. విలక్షణంగా వస్త్రం ధరించినా, ధనుర్బాణాలూ, కవచం ధరించే వీరునిలాగా ఉన్నావు. నీవు రథం ఎక్కి తిరుగు. నా కుమారులతో సమానంగా ఉండు. నేను వృద్ధుణ్ణి. రాజ్యభారం తగ్గించుకోవాలనుకుంటున్నాను. నీ శక్తితో ఈ దేశపాలనలో సహాయం చెయ్యి. నీలాంటి రూపం కలవారు నపుంసకులు కాజాలరని నా మనస్సు చెపుతోంది!' అన్నాడు.

అర్జునుడు సిగ్గు నటిస్తూ, 'రాజా! మీరు నా రూపాన్ని ప్రశంసించి ప్రయోజనం లేదు. దానివల్ల నా దుఃఖం మరింత పెరుగుతుంది. నేను గానం చేస్తాను. నృత్యం చేస్తాను. మృదంగవాదనం కూడా చేస్తాను. మీ కుమార్తె ఉత్తరకు విద్య నేర్పడానికి నన్ను నియమించండి! నాకు మీ రాజ్యంలో ఆశ్రయమివ్వండి!' అని ప్రాధేయపడ్డాడు.

విరాటుడు, 'బృహన్నలా! నీవు కోరిన వరం ఇస్తున్నా! నా కుమార్తెకూ, ఇతర కన్యలకూ నృత్యం నేర్పు. కానీ ఈ పని నీకు ఇవ్వడం నాకు ఇష్టం లేదు. నిజానికి నిన్ను చూస్తే ఈ భూమండలాన్నే పరిపాలించే సమర్థత గలిగిన వాడిలాగా కనిపిస్తున్నావు!" అంటూ, ఆ బృహన్నలను గురించి తన మంత్రులందరితో ఆలోచన చేసి, కళలలో, నృత్యాలలో, వాదనాలలో అతణ్ణి పరీక్షించి, అతడి నపుంసకత్వం నిజమైనదేనని నిర్ధారణ చేసుకోవడానికి

పరీక్ష చేయించి, ఆ తర్వాతనే అతణ్ణి తన అంతఃపురానికి పంపాడు. ఊర్వశి శాపం కారణంగా ఆ ఏడాది కాలం శారీరికంగా కూడా అర్జునుడు నపుంసకుడిగా మారాడు. అలా, సర్వసమర్థుడైన ధనంజయుడు విరాటుని పుత్రికనూ, పరిచారికలనూ తన బిడ్డలతో సమానంగా చూస్తూ, నృత్యగీత వాద్యాలను నేర్పుతూ, వారికి ఇష్టుడు అయ్యాడు. అంతఃపురంలో తిరిగేవారు కానీ, బయటవారు కానీ, అతడి నిజరూపాన్ని కనిపెట్టలేక పోయారు.

పాండవులు విరాటరాజు కొలువులో అనేక అవమానాలకూ, కష్టాలకూ ఓరుస్తూ అజ్ఞాతవాసకాలంలో పది నెలలు గడిపారు. అక్కడ విరాటరాజు సేనాపతి, మహారాణికి తమ్ముడు, మహాబలవంతుడు అయిన కీచకుడు ద్రౌపదిని మోహించి, వేధిస్తూ ఉండడంతో, భీముడు ద్వంద్వయుద్ధంలో అతణ్ణి చంపివేశాడు.

## 37. చేసే పనిని ఆలోచించి చేయాలి

అయితే మహాబలవంతుడైన కీచకుడు చంపబడ్డాడన్న వార్త దుర్యోధనుడికి చేరింది. కీచకుణ్ణి ఎదుర్కోగలవారు ప్రపంచంలోనే అతి కొద్దిమంది ఉన్నారు. వారిలో భీముడు ఒకడు. కౌరవసభలోని ప్రముఖులు, 'భీముడే కీచకుణ్ణి చంపి ఉంటాడు. పాండవులు మత్స్యదేశంలో ఉండి ఉంటారు. మనం ఆ దేశం మీద యుద్ధం ప్రకటిస్తే, పాండవులు తప్పక యుద్ధానికి వస్తారు. అప్పుడు వారి అజ్ఞాతవాస దీక్షకు భంగం కలుగుతుంది!' అని ఆలోచించారు. ఆ సభలోనే ఉన్న త్రిగర్తదేశపు రాజైన సుశర్మ, "మత్స్యదేశపు రాజైన విరాటుడితో నాకు ఎప్పటి నుంచో వైరం ఉంది. ఇప్పుడు కీచకుడు కూడా విరాటుడికి సహాయంగా లేడు కనుక మనం సునాయాసంగా ఆ దేశాన్ని కొల్లగొట్టి అంతులేని ధనాన్నీ, రత్నాలనూ, ఆవుల మందలనూ పొందవచ్చు" అన్నాడు.

దుర్యోధనుడు తన తమ్ముడైన దుశ్శాసనుడితో, "సైన్యాన్ని సిద్ధం చెయ్యి. సుశర్మ త్రిగర్త సేనలతో దక్షిణ దిశ నుంచి మత్స్యదేశం మీద దాడి చేసి అక్కడి

ఆవుల మందలను పట్టుకుంటాడు. మర్నాడు మనం ఉత్తర దిక్కు నుండి దాడి చేద్దాం" అన్నాడు. కౌరవులు ఉత్తర దిశలో వచ్చి, అక్కడి గోవులను అపహరించారు కనుకనే ఈ వృత్తాంతానికి మహాభారతంలో 'ఉత్తర గోగ్రహణం' అని పేరు వచ్చింది.

ఈ పథకం ప్రకారం సుశర్మ తన బలాలతో మత్స్యదేశం మీదికి దండ యాత్రకు బయలుదేరాడు. మర్నాడు కౌరవసేనలు కదిలాయి. గోపాలకులు విరాటుని వద్దకు వచ్చి త్రిగర్తసైన్యాలు దక్షిణదిక్కుగా వచ్చి గోవులను వశపరచుకున్నారనీ, వారిని ఎదిరించి గోవుల మందలను కాపాడమనీ ప్రార్థించారు. కీచకుడి లోటుతో తమ సైన్యం బలహీనమైనప్పటికీ, తప్పనిసరై, విరాటుడు తన సైన్యాన్ని ఆయత్తపరచి, తన తమ్ములతో యుద్ధానికి బయలుదేరాడు. ఈ లోపల విరాటనగరంలో రహస్యంగా జీవిస్తున్న పాండవుల అజ్ఞాతవాసం గడువు పూర్తి అయింది.

తన వద్ద ఉన్న పాండవులలో ధర్మరాజూ, భీముడూ, నకులసహదేవులూ యుద్ధం చేయగలిగే ఉంటారని వారి కోసం కూడా విరాటుడు రథాలను సిద్ధం చేయించాడు. ఇరుసైన్యాలకూ మధ్య జరిగిన భీకరమైన యుద్ధంలో సుశర్మ విరాటుణ్ణి ఓడించి ప్రాణాలతో పట్టుకున్నాడు. విరాటుడి సేన కకావికలై పారిపోసాగింది. అప్పుడు ధర్మరాజు భీముణ్ణి వెళ్ళి, తాను భీముడన్న సంగతి బయటపడకుండా విరాటరాజును విడిపించమని ఆజ్ఞాపించాడు. భీముడు సుశర్మతో పోరాడి, అతణ్ణి చితకపొడిచి, బంధించి విరాటుణ్ణి విడిపించాడు. ఇక, విరాటుడు యుద్ధం గెలిచిన ఆనందంలో రాజధానికి తిరిగి వస్తున్నాడు. అయితే, దుర్యోధనుడు బ్రహ్మాండమైన సేనతో ఉత్తర దిక్కు నుంచి తన రాజ్యం మీదకు దాడి ప్రారంభించాడని అతడికి తెలియదు.

భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ వంటి యోధులతో కూడిన గొప్ప సైన్యంతో దుర్యోధనుడు ఉత్తర దిక్కు నుండి విరాటదేశంలోకి ప్రవేశించి అక్కడి గోవుల మందలను పట్టుకున్నాడు. గోపాలకుల పెద్ద ఈ వార్తను తెలపడానికి రథం మీద వేగంగా విరాటనగరానికి వెళ్ళి, రాజకుమారుడైన ఉత్తరుణ్ణి చూసి, "రాజకుమారా, ఉత్తరదిక్కులో కౌరవులు మన ఆరువేల

గోవులను పట్టుకున్నారు. నువ్వు మహావీరుడవని రాజుగారు చెపుతూ ఉంటారు. నీవు వచ్చి, మన గోవులను వచ్చి విడిపించు. కౌరవ సేనను చీల్చి చెండాడు!" అన్నాడు. ఆ వార్త వినేటప్పుడు ఉత్తరుడు స్త్రీల మధ్య కూర్చుని ఉన్నాడు. అందుచేత తాను నిజంగా మహాయోధుణ్ణే అని వారికి చూపడం కోసం, "మన ఆవులను నేను అవలీలగా మరల్చగలను గానీ, నాకు యుద్ధమర్మం తెలిసిన సారథి లేకపోవడం ఎంతో విచారంగా ఉన్నది. మంచి సారథిని చూడండి!" అని ప్రగల్భాలు పలికాడు.

ఉత్తరుడి వద్ద ఉన్న స్త్రీలతోపాటు బృహన్నల రూపంలో అర్జునుడు కూడా ఉన్నాడు. కౌరవులతో యుద్ధం చేయడానికి అర్జునుడు చాలా ఉత్సుకతతో ఉన్నాడు కూడా. అతడు తమ అజ్ఞాతవాసం పూర్తి అయినట్టు లెక్క చూసుకుని, రహస్యంగా ద్రౌపదితో, "నేను ఒకప్పుడు అర్జునుడికి సారథిగా ఉండి, అతడి మెప్పు పొందినవాణ్ణని ఉత్తరుడికి చెప్పు! నన్ను సారథిగా పెట్టుకోమను!" అన్నాడు. ద్రౌపది నవ్వు ఆపుకుంటూ ఉత్తరుణ్ణి సమీపించి, అర్జునుడు చెప్పమన్న మాట చెప్పింది. బృహన్నల నపుంసకుడని సందేహించనవసరం లేదనీ, అతడి సారథ్యంలో తప్పక గెలుస్తావనీ ద్రౌపది గట్టిగా చెప్పిన మీదట ఉత్తరుడు సరేనన్నాడు. ఉత్తరుడి ఆజ్ఞ మేరకు అతడి చెల్లెలు ఉత్తర బృహన్నలను సమీపించి, తన అన్నకు సారథిగా పని చేయమని కోరింది.

ఉత్తరుడు కౌరవ యోధులతో యుద్ధం చేయడానికీ, అర్జునుడు అతడికి సారథ్యం చేయడానికీ సిద్ధమయ్యారు. అర్జునుడు అన్నీ తెలిసినవాడై కూడా ఉత్తర ఎదుట నవ్వు పుట్టించేలా తెలియనితనాన్ని ప్రదర్శించాడు. కవచం సరిగా తొడుగుకొనలేకుండా ఉన్న బృహన్నలను చూసి ఉత్తరుడు తానే స్వయంగా కవచాన్ని అతడికి తొడిగాడు. ఇది చూసి అక్కడున్న రాకుమార్తెలు కళ్ళు పెద్దవిగా చేసుకుని నవ్వుకున్నారు. ఉత్తరా, ఆమె తోటి ఆడపిల్లలూ బృహన్నలతో, "మీరు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులను జయించి, వారు ధరించిన తలపాగాలలోంచి మా ఆట బొమ్మలకు రంగు రంగుల బట్టలు, మెత్తనివి తీసుకురండి," అని కోరారు. అర్జునుడు నవ్వి, "ఉత్తరుడు గెలిస్తే అలాగే తెస్తాను!" అన్నాడు.

---

ఏ పనినైనా, ముందువెనకలు బాగా ఆలోచించి పని చేయాలి. సాధారణంగా మనుష్యులు ముందు ఏదోవొకటి చేసి, ఆ తర్వాత పని సానుకూలంగా జరగలేదని వాపోతూ ఉంటారు. పని చేసే ముందుగానే, దాన్ని చేయడం ఎలా, అందులో ఏమైనా మెలకువలు ఉన్నాయా, ఎక్కడ పొరపాటు జరగవచ్చు అని అన్నివిధాలుగా ఆలోచించాలి. ఆ పని గురించి తెలిసిన వారెవరైనా ఉంటే వారి సంప్రదిస్తే ఇంకా మంచిది. అలా ఆలోచించి పనిచేసినప్పుడు అది ఏ పనైనా చక్కగా జరుగుతుంది. "చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టమన్నారు!" అని సామెత. అర్జునుడు ముందుగా తమ అజ్ఞాతవాసం గడువు పూర్తయినదీ లేనిదీ స్పష్టంగా చూసుకున్నాడు. ఎందుకంటే, అజ్ఞాతవాసంలో ఉన్న తమను కనిపెట్టి తిరిగి అడవులకు పంపడానికే దుర్యోధనుడు విరాటదేశం మీదకు దండెత్తాడని అర్జునుడికి తెలుసు.

## 38. యుద్ధంలో వెన్నుచూపేకన్న మరణమే మేలు

*రథం నగరం దాటింది. ఉత్తరుడు అర్జునుడితో, "బృహన్నలా, కౌరవ సేనలుండే దిక్కుగా రథాన్ని నడుపు! మనం వారిని జయించి, ఆవులను మళ్ళించుకుని త్వరగా తిరిగి రావాలి!" అన్నాడు. అర్జునుడు రథాన్ని వేగంగా నడిపాడు. దూరాన కౌరవసేన మహా సముద్రంలాగా కనిపించింది. ఆ సేనలు రేపిన దుమ్ము ఆకాశంలోకి లేస్తున్నది.*

*ఆ దృశ్యం చూసి ఉత్తరుడు బెదిరిపోయాడు. "అమ్మో, ఈ సేనను నేనెట్లా గెలుస్తాను? దేవతలు కూడా ఈ సేనను గెలవలేరు. మా తండ్రి సైన్యంతో సహా త్రిగర్తులతో యుద్ధానికి వెళ్ళడం చేత నేను నగరంలో ఒంటరిగా దిగబడిపోయాను కానీ, భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, మిగిలిన యోధులనూ నేను ఒక్కణ్ణే ఎదిరించగలనా? బృహన్నలా! రథాన్ని వెనక్కు తిప్పు!" అని ఉత్తరుడు లబలబలాడాడు. "నాయనా! భయపడకు.*

వెన్నుచూపి పారిపోతే శత్రువులు నవ్వుతారు. వాళ్ళతో యుద్ధం చెయ్యి! గెలిచి వస్తానని ఆడవాళ్ళ ముందు గొప్పలు చెప్పావు. నేను రథాన్ని శత్రువుల మీదకే పోనిస్తాను. ఏ విధంగానైనా సరే వాళ్ళను జయించకుండా తిరిగి పోకూడదు!" అన్నాడు అర్జునుడు. "కౌరవులు మా గోవులను ఎత్తుకుపోతే పోనీ! స్త్రీలు నన్ను చూసి నవ్వితే నవ్వనీ! నేను మాత్రం యుద్ధం చేయలేను!" అంటూ ఉత్తరుడు విల్లూ బాణాలూ పారేసి, రథం మీద నుంచి కిందికి దూకి నగరం కేసి పరుగెత్తసాగాడు. "యుద్ధంలో చావనైనా చావాలి గాని, వెన్ను చూపి పారిపోవటమా? ఎంత సిగ్గుచేటు!" అంటూ అర్జునుడు రథం దిగి, నాలుగు అడుగుల్లో ఉత్తరుణ్ణి జుట్టు పట్టుకుని ఆపాడు. అర్జునుడి యొక్క పేడివాని ఆకారం చూసి, అతడే అర్జునుడని తెలుసుకోలేక కౌరవ వీరులు విరగబడి నవ్వారు.

తనను వెళ్ళనివ్వమని రకరకాలుగా వేడుకుంటున్న ఉత్తరుణ్ణి రథం దగ్గరికి లాగుకొని వచ్చి, "నేను యుద్ధం చేసి గోవులను విడిపిస్తాను. నువ్వు రథం నడుపు," అంటూ అర్జునుడు అతణ్ణి రథం ఎక్కించి, తాము ఆయుధాలు దాచిన శమీవృక్షం దగ్గరికి తీసుకుపోయాడు. అక్కడ అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, నీ వద్ద ఉన్న ఆయుధాలు చాలవు. ఈ చెట్టు ఎక్కు. దీని మీద పాండవులు తమ ఆయుధాలు దాచారు. అందులో అర్జునుడి గాండీవం కూడా ఉన్నది. ఆ మూట విప్పావంటే నీకు ఆయుధాలన్నీ కనిపిస్తాయి," అన్నాడు. ఉత్తరుడు చెట్టు ఎక్కి, ఆయుధాలను విప్పి చూసి ఆశ్చర్యపడుతూ, "మాయాజూదంలో రాజ్యం పోగొట్టుకున్న పాండవులూ, ద్రౌపదీ ఏమయ్యారో తెలియదు కదా!" అని విచారం వెలిబుచ్చాడు. "నేనే అర్జునుణ్ణి! మీ తండ్రి కొలువులో ఉండే కంకుభట్టు ధర్మరాజు. మీ వంటవాడైన వల్లవుడే భీముడు, గుర్రాలను చూసే దామగ్రంథి నకులుడు. గోవులను కాస్తున్న తంతిపాలుడు సహదేవుడు. కీచకుడి చావుకు కారణమైన సైరంధ్రియే ద్రౌపది" అని అర్జునుడు అన్నాడు. ఉత్తరుడు అర్జునుడి మాటలను నమ్మలేక పోయాడు.

"అజ్ఞానంతో, చెట్టుచేమలలాగా బ్రతకడం కన్నా మరణమే మేలు! ఓడిపోయి బ్రతకడం కన్నా యుద్ధభూమిలో

వీరమరణమే *మేలు!"* అని స్వామీజీ చెప్పారు. ఇదే ఒక సైనికుడు పాటించవలసిన క్షత్రియధర్మం. ఉత్తరుడికీ, అర్జునుడికీ క్షత్రియధర్మమే వర్తిస్తుంది. అయితే ఉత్తరుడు తన ధర్మాన్ని మరచిపోయి, పారిపోవాలనుకున్నాడు. అర్జునుడు తన ధర్మాన్ని వదలకుండా పాటించాడు.

ఒకడు సైన్యంలో చేరాడనుకోండి. యుద్ధానికి వెళ్ళినపుడు ఆ సైనికుడు ఏమి చేస్తాడు? అక్కడ తాను చనిపోతానేమోనని ఆలోచించడు. తాను పోతే తన ఆలుబిడ్డల సంగతి ఏమౌతుందని ఆలోచించడు. చావో బ్రతుకో తేల్చుకోవాలనుకుంటాడు. అయితే ఇది సైనికులకే కాక సమాజంలోని అన్ని రంగాల వారికీ, అన్ని వృత్తుల వారికీ వర్తిస్తుంది. ఎందుకంటే సైనికుడు యుద్ధభూమిలో ప్రవర్తించినట్టే ప్రతీ పౌరుడు సమాజం కోసం త్యాగబుద్ధిని చూపాలి.

ప్రభుత్వ కార్యాలయంలో పనిచేసే ఉద్యోగి మోసంతో డబ్బు సంపాదిస్తే అది యుద్ధంలో వెన్నుచూపి పారిపోవడం లాంటిదే. దాని కన్నా చావడమే మేలు. "చావనన్నా చస్తాను గానీ నీతి తప్పను!" అన్న పట్టుదల గలవారు, రాజీపడని వారు సమాజానికి కావాలి. తన పనిని తాను సక్రమంగా చేయకుండా రాజీపడాలనుకునే వారందరూ వెన్నుచూపి పారిపోయేవారితో సమానులే. అయితే మనుష్యులు ఎందుకు అలా ప్రవర్తిస్తారు? ఎందుకంటే స్వామీజీ చెప్పినట్టు వారు అజ్ఞానంతో బ్రతుకుతున్నారు కనుక. అజ్ఞానమే మన భయాలకూ, దుఃఖాలకూ మూలకారణం. అజ్ఞానమంటే మన నిజ స్వభావమేమిటో మనకు తెలియకపోవడమేనని స్వామీజీ చెప్పారు. *"భయమే దుఃఖాలకు మూలకారణం. భయమే మనుష్యుల్ని దుర్మార్గుల్ని చేస్తుంది. భయమే మరణానికి*

కారణం. మరి ఈ భయానికి కారణమేమిటి? మన నిజస్వభావమేమిటో మనకు తెలియకపోవడమే!"

## 39. ఆత్మవిశ్వాసమే అమోఘమైన బలం

*తన మాటలు నమ్మలేకుండా ఉన్న ఉత్తరుడికి ధైర్యం కలిగించేందుకు అర్జునుడు తన పేడి వేషాన్ని తీసివేసి నిజరూపాన్ని చూపాడు. అప్పటికి అజ్ఞాతవాసం పూర్తి కావడంతో ఊర్వశి శాపం తీరిపోయింది. తానెవరో, తన గొప్పతనమేమిటో, తనకు ఏమేమి పేర్లున్నాయో, అవి ఎలా వచ్చాయో అర్జునుడు వివరించి చెప్పాడు. "అర్జున, ఫల్గుణ, పార్థ, కిరీటి, శ్వేతవాహన, బీభత్సు, విజయ, కృష్ణ, సవ్యసాచి, ధనంజయ అని నాకు పది పేర్లు. నేను అందరిపట్ల సమభావంతో ఉంటూ, ఋజుమార్గంలో నిష్కల్మషంగా పని చేస్తాను కనుక నన్ను విజ్ఞులు 'అర్జునుడు' అంటారు. ఉత్తర ఫల్గుణీ నక్షత్రం రోజున పుట్టిన నన్ను 'ఫల్గుణుడు' అంటారు. నా తల్లి కుంతి పృథ వంశానికి చెందినది కాబట్టి నన్ను 'పార్థుడు' అంటారు. స్వర్గంలో సూర్యకాంతిని విరజిమ్మే కిరీటాన్ని ఇంద్రుడు నా తలమీద ఉంచాడు కాబట్టి నన్ను 'కిరీటి' అంటారు. నా రథానికి తెల్లని గుర్రాలు కడతారు కాబట్టి నేను 'శ్వేతవాహనుణ్ణి'. యుద్ధంలో నేను ఎవరికీ ఏవగింపు కలిగించే పనిని చేయను కాబట్టి 'బీభత్సువు'గా ప్రసిద్ధుణ్ణి అయ్యాను. యుద్ధోన్మత్తులైన వారిని ఓడించకుండా తిరిగిరాను కనుక నన్ను 'విజయుడు' అంటారు. నల్లగా మెరుస్తున్న దేహకాంతితో, పసితనంలో ముద్దులొలుకుతున్న నాకు, నా తండ్రి 'కృష్ణ' అని పేరు పెట్టాడు. నా కుడి ఎడమ చేతులు రెండింటితోనూ ఒకే సామర్థ్యంతో గాండీవాన్ని ఎక్కుపెట్టి బాణాలు వేయగలను కాబట్టి నన్ను 'సవ్యసాచి' అని పిలుస్తారు. దేశాలన్నింటినీ జయించి ధనాన్ని కోకొల్లలుగా తెచ్చాను కనుక నన్ను 'ధనంజయుడు' అంటారు" అని వివరించాడు.*

అది విని, ఉత్తరుడు అర్జునుడి కాళ్ళమీద పడి, "నీ పరిచయం కలగడం నా మహాభాగ్యం. తెలియక ఏమేమో వాగి ఉంటాను. క్షమించు! ఇప్పుడు నా భయం పోయింది.

ఇక నువ్వు దేవతల సేన మీదకు రథాన్ని నడుపమన్నా నడుపుతాను” అన్నాడు.

అర్జునుడికి తన గొప్పతనమేమిటో తెలుసు. మన శక్తి యుక్తులేమిటో మనమే తెలుసుకోగలిగితే జీవితంలో మనకు ఎదురుండదు. మన మీద మనకు విశ్వాసముండడమే అన్నిటికన్నా ముఖ్యమని స్వామీజీ చెప్పారు కదా!

## 40. నిజమైన బలవంతుడే బలహీనులకు సహాయపడగలడు

అర్జునుడికి ఉన్న గొప్ప లక్షణాలలో ఔదార్యం ఒకటి. ఉత్తరుడు బలహీనుడయినప్పటికీ అర్జునుడు అతణ్ణి చులకనగా చూసి, గేలిచేయలేదు. సాధారణంగా మనుష్యులు తమ కన్నా తక్కువ శక్తిమంతులు, నేర్పరులు ఎదురైనపుడు వారిని ఛీకొడుతూ కనిపిస్తారు. ధనవంతులు పేదలను తూలనాడడం, రూపవంతులైనవారు కురూపులను పరిహసించడం, బలవంతులు బలహీనులను తక్కువచేసి చూడడం, ధైర్యవంతులు పిరికివారిని గేలిచేయడం మనకు అన్నిచోట్లా కనిపిస్తూనే ఉంటుంది. కానీ అర్జునుడు అలాంటి వాడు కాడు. పెద్దమనస్సు గలవాడు - మహాత్ముడు. తోటి వారు వారి బలహీనతలను అధిగమించేందుకు సహాయ పడడం బలవంతుల, ధైర్యవంతుల బాధ్యత అని గుర్తెరిగిన వాడు. ఉత్తరుడికి ధైర్యం నూరిపోసి, అతడి బాధ్యతను గుర్తుచేసి, అతడిలోని శక్తి ఏమిటో అతడే గుర్తించేలా చేశాడు అర్జునుడు. ఉత్తరుడు ఆనాడు అర్జునుడి రథాన్ని నడపడంలో

గొప్ప ప్రజ్ఞను చూపడమే కాక, కురుక్షేత్ర సంగ్రామంలో కూడా గొప్ప పాటవాన్ని చూపి, వీరమరణం పొందాడు.

## 41. "ఒక్కడె చాలు!"

*అర్జునుడు ఆయుధాలను రథం మీద పెట్టించి, ఉత్తరుడితో, "ఇక నీ శత్రువులను నేనెలా నాశనం చేస్తానో చూడు!" అంటూ గాండీవాన్ని తన చేతిలోకి తీసుకున్నాడు. తన చేతి కంకణాలు తీసివేసి, జుట్టును ముడి వేసుకుని, తూర్పుగా తిరిగి అస్త్రాలను ధ్యానించాడు. అతడు గాండీవానికి అల్లెత్రాడు తగిలించి మీటేసరికి ఒక మహాధ్వని పుట్టింది. అర్జునుడు శంఖం పూరించేసరికి చెవులు గింగురుమన్నాయి. ఆ శబ్దాలకు ఉత్తరుడే అదిరిపడ్డాడు.*

*అర్జునుడి రథం తమ కేసి వస్తుంటే చూసి ద్రోణాచార్యుడు దుర్యోధనుడితో, "ఆ వచ్చేవాడు నిశ్చయంగా ఫల్గుణుడే!" అన్నాడు. ఆ మాట విని దుర్యోధనుడు, "అజ్ఞాతవాస సంవత్సరం పూర్తి కాకమునుపే అర్జునుడు బయటపడ్డాడు. పాండవులు తిరిగి పన్నెండేళ్ళు వనవాసం చేయాలి. గడువు తీరలేదని వాళ్ళు ఎరగకపోయి ఉండాలి. లేదా మనం పొరపాటు పడివుండాలి. సరియైన లెక్క తేల్చవలసినవాడు భీష్ముడే!" అన్నాడు. "గడువు తీరకపోతే అర్జునుడు ఇలా బయటపడడు. అతడు గోవులని విడిపించుకోకుండా తిరిగిపోడు కనక యుద్ధం తప్పదు!" అన్నాడు ద్రోణుడు. భీష్ముడు దుర్యోధనుడితో, "ప్రతి అయిదేళ్ళకూ రెండేసి అధికమాసాలు వస్తాయి. పాండవులు వనవాసం కిందా, అజ్ఞాతవాసం కిందా గడిపిన పదమూడేళ్ళలోనూ అయిదు నెలల పన్నెండు రోజులు అధికంగా వచ్చాయి. ఆ లెక్క ప్రకారం పాండవుల అజ్ఞాతవాసం గడువు తీరిపోయింది. అది తెలిసే అర్జునుడు వస్తున్నాడు. అందుచేత న్యాయంగా పాండవులకు రాజ్యం ఇస్తావో, ఇవ్వకుండా అధర్మయుద్ధం చేస్తావో తేల్చుకో!" అన్నాడు. "నేను పాండవులకు రాజ్యం ఇవ్వనుగాక ఇవ్వను! యుద్ధానికి సిద్ధం కండి!" అన్నాడు దుర్యోధనుడు.*

"అలా అయితే, నువ్వు మన సేనలో నాలుగవవంతును వెంట బెట్టుకుని హస్తినాపురానికి బయలుదేరు. మరొక నాలుగవ వంతు సేన గోగణాలతో నీ వెనుకనే వస్తుంది. మిగిలిన సగం సేనతో నేనూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వత్థామా, కృపుడూ అర్జునుణ్ణి ఎదిరించి యుద్ధం చేస్తాం," అన్నాడు భీష్ముడు. భీష్ముడి ఆలోచన అందరికీ నచ్చింది. దుర్యోధనుడు కూడా అలా చేయడానికి సమ్మతించాడు. భీష్ముడు సేనను వ్యూహపరచి, ఏ పక్కన ఏ యోధుడు నిలబడాలో నిర్ణయించాడు. వ్యూహంలో నిలబడిన కౌరవసేన కేసి అర్జునుడి రథం వచ్చింది. అప్పుడు అర్జునుడు గుర్తించడానికి వీలుగా కనిపించాడు. అతడు ఉత్తరుడితో, "బాణం వేటు దూరంలో రథాన్ని నిలుపు. దుర్మార్గుడైన దుర్యోధనుడు ఎక్కడ ఉన్నదీ చూస్తాను. మిగిలిన వాళ్ళను వదిలేసి అతణ్ణి జయిస్తే, వీరందరూ ఓడినట్టే!" అన్నాడు.

అయితే దుర్యోధనుడు అప్పటికే గోవులతో పారిపోతున్నాడని అర్జునుడు కనిపెట్టి మిగిలిన యోధులందరినీ వదిలి అతడివైపు రథాన్ని నడుపమన్నాడు. ఇది చూసి కౌరవవీరులందరూ అడ్డంగా వచ్చారు. అప్పుడు వారితో జరిగిన యుద్ధంలో అర్జునుడు భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, అశ్వత్థామనూ ఓడించి, వెనుదిరిగేలా చేశాడు. దుర్యోధనుడితో జరిగిన యుద్ధంలో అతడి రొమ్ములో ఒక బాణాన్ని బలంగా నాటేసరికి అతడు పారిపోసాగాడు. అది చూసి అర్జునుడు అతణ్ణి గేలిచేశాడు. దానితో అతడు రోషంతో తిరిగి యుద్ధానికి వచ్చాడు. ఇక కౌరవవీరులందరూ కూడా ఒక్కసారిగా అర్జునుడి మీద విరుచుకుపడ్డారు. దానితో అర్జునుడు సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించి వారందరికీ, సైన్యానికీ స్పృహ తప్పేలా చేశాడు. వారందరూ ఒళ్ళు తెలియకుండా పడివుంటే, అర్జునుడు ఉత్తరుడితో, 'ఉత్తరా! పగ్గాలు పక్కన పెట్టి వెళ్ళి, త్వరగా ఆ యోధుల తలపాగాలు తీసుకురా. నీ సోదరి ఉత్తర రంగురంగుల బొమ్మ పొత్తికలు తెమ్మన్నది కదా! నేను వేసిన అస్త్రం భీష్ముణ్ణి బాధించదు. అందుచేత ఆయన జోలికి వెళ్ళకు' అని చెప్పాడు.

ఉత్తరుడు వెళ్ళి, తలపాగాలు తీసుకుని వెంటనే తిరిగి వచ్చి రథం ఎక్కాడు. అతను రథాన్ని సేనల మధ్యగా నడుపుతుంటే భీష్ముడు అర్జునుణ్ణి

*తన బాణాలతో అటకాయించాడు. అర్జునుడు భీష్ముడి రథపు గుర్రాలను చంపి, భీష్ముడితో యుద్ధానికి దిగకుండా ముందుకు సాగాడు. గోపాలకులు ఆవుల మందలను విరాటదేశానికి తోలుకుపోసాగారు. అంతలో దుర్యోధనుడికి తెలివి వచ్చింది. వెళ్ళిపోతున్న అర్జునుణ్ణి చూసి, "అర్జునుణ్ణి ఎందుకు నిశ్చింతగా వెళ్ళనిస్తున్నారు? అతడు తప్పించుకుని పోకుండా చూడండి!" అని కేక పెట్టాడు. ఆ మాట విని భీష్ముడు, "నీ తెలివి తెల్లవారినట్టే ఉంది! అందరూ విల్లమ్ములు జారవిడిచి స్పృహతప్పి ఉంటే, అర్జునుడు అందరినీ చంపగలిగి ఉండి కూడా తలగుడ్డలు మాత్రం తీసుకున్నాడు. ఇక అతడు గెలిచినట్టు ఒప్పుకో! ఆవుల మందలను తీసుకుపోనియ్యి!" అన్నాడు. భీష్ముడు చెప్పిన ప్రకారం కౌరవులు ఓటమి ఒప్పుకుని వెనుదిరిగారు. రాబోయే కురుక్షేత్రయుద్ధంలో తానొక్కడే కౌరవసైన్యం మొత్తాన్ని ఓడించగలడని ఈ ఉత్తర గోగ్రహణఘట్టంలోనే అర్జునుడు ఋజువు చేశాడు.*

ఒక్కఁడెచాలు నిశ్చల బలోన్నతుఁడెంతటి కార్యమైనఁ దాఁ
జక్కనొనర్పఁ; గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసేన ననేక శిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసి తుద ముట్టఁడె యొక్క కిరీటి భాస్కరా!

భాస్కరశతకంలోని ఈ పద్యం ఈ ఉత్తరగోగ్రహణ ఘట్టాన్ని చక్కగా వివరిస్తుంది. అర్జునుడిలాంటి వీరుడొక్కడే అంతమంది కౌరవవీరులను ఓడించగలిగాడని ఈ పద్యం వర్ణిస్తుంది. అర్జునుణ్ణి 'నిశ్చలబలోన్నతుడు' అని శతక కారుడు కొనియాడాడు. మనస్సును నిశ్చలంగా ఉంచుకున్న వాడు, మహా బలమైన శరీరం కలిగినవాడే - ఎంతటి కార్యమైనా చక్కబెట్టగలడు. "ఇనుప కండలు, ఉక్కు నరాలు *కావాలి. వాటితో పాటు పిడుగులాంటి పదార్థంతో తయారైన మనస్సు కావాలి!"* అని స్వామీజీ చెప్పారు. అంటే శరీరం,

మనస్సు రెండూ గొప్పబలంతో కూడి ఉన్నప్పుడు మనిషి ఎంతటి పనినైనా అర్జునుడిలాగా ఒక్కడే సాధించగలడని మనం అర్థం చేసుకోవాలి.

కౌశలం ఉన్నవాడికీ, లేనివాడికీ తేడా ఏమిటో కూడా ఈ సందర్భంగా మనం అర్థం చేసుకోవచ్చు. దుర్యోధనాదులు హఠాత్తుగా వచ్చిపడినా, అర్జునుడు చక్కగా వారిని ఎదుర్కొని ఓడించగలిగాడు. వారిని అప్పుడే మట్టుబెట్టగలిగినా, ఔదార్యంతో వదిలిపెట్టాడు.

అంతేకాక, అతడి ఆయుధాలు అతడికి సహాయపడేవే కానీ, అవే అతడికి విజయాన్ని కొనితేలేవు. 'రౌతు కొద్దీ గుర్రం!' అని తెలుగు సామెత. గుర్రం ఎక్కి కూర్చున్న రౌతుకు గుర్రాన్ని ఎలా నడపాలో తెలియకపోతే అది పంచకళ్యాణి గుర్రమే అయినా ప్రయోజనం లేదు కదా!

## 42. ఆత్మవిశ్వాసం, దైవసహాయం

***వనవాసం, అజ్ఞాతవాసం విజయవంతంగా పూర్తి చేసుకున్న పాండవులు తమ రాజ్యం తమకు తిరిగి ఇవ్వమనీ, లేకపోతే కౌరవుల నాశనం తప్పదనీ రాయబారం పంపారు. అయితే దుర్యోధనుడు సూది మొన మోపినంత భూమి కూడా ఇవ్వనని భీష్మించాడు. ఈ సందర్భంగా ఇతరులతోపాటు కృష్ణుడు చేసిన రాయబారం కూడా విఫలమైంది. ఇక యుద్ధం తప్పదని తెలిసిపోయింది. పాండవులూ, కౌరవులూ తమ తమ యుద్ధసన్నాహాలు చేస్తున్నారు. తమ దూతలను పంపి రాజులందరినీ యుద్ధంలో తమ పక్షాన చేరమని కోరుతున్నారు. మిగిలిన రాజులందరి వద్దకు దూతలను పంపిన దుర్యోధనుడు కృష్ణుడి వద్దకు సామాన్యమైన దూతను పంపడం భావ్యం కాదనీ, తానే వెళ్ళాలనీ నిశ్చయించుకున్నాడు. కొద్ది పరివారాన్ని వెంటబెట్టుకుని, గుర్రాల మీద హుటాహుటిని వచ్చి ద్వారకకు చేరాడు. వచ్చీరావడంతోనే కృష్ణుడి మందిరంలోకి ప్రవేశించాడు. ఆ సమయానికి కృష్ణుడు నిద్రపోతున్నాడు.***

కృష్ణుడు తమ పక్షాన ఉంటాడని పాండవులకు తెలుసు. అయినా సరే, అతణ్ణి యుద్ధంలో తమ పక్షం వహించమని మరొక్కసారి కోరాలని వారు భావించారు. ఆ భారాన్ని పాండవులు అర్జునుడి మీద ఉంచారు. ఎందుకంటే, అర్జునుడు శ్రీకృష్ణుడి చెల్లెలయిన సుభద్రకు భర్త. అర్జునుడు కూడా దైవికంగా, దుర్యోధనుడు చేరుకున్న రోజే ద్వారకకు చేరుకుని, అదే వేళకు కృష్ణుడి మందిరంలో ప్రవేశించాడు. ముందు వచ్చిన దుర్యోధనుడు నిద్రపోతున్న కృష్ణుడి తలవైపు ఉన్న ఆసనంలో కూర్చున్నాడు. తర్వాత వచ్చిన అర్జునుడు కృష్ణుడి కాళ్ళ దగ్గర వినయంగా నిలబడ్డాడు. కృష్ణుడు నిద్రలేచి ముందు అర్జునుణ్ణి, తరువాత దుర్యోధనుణ్ణీ చూశాడు. ఇద్దరినీ కుశల ప్రశ్నలు అడిగి, గౌరవించి, వచ్చిన పని ఏమిటని అడిగాడు. దుర్యోధనుడు, "యుద్ధంలో నీ సహాయం కోరుదామని నేను వచ్చాను. కౌరవులూ, పాండవులూ యాదవులకు బంధువులే కదా. ఇవాళ నీ దర్శనం కోసం నేను ముందు వచ్చాను. సజ్జనులైనవారు ముందు సహాయం కోరిన వారినే ఆదరిస్తారు. అన్ని ధర్మాలూ పూర్తిగా తెలిసినవాడివి నువ్వు. అందుచేత నీ సహాయం అంతా మాకే అందించాలని కోరుతున్నాను."

కృష్ణుడు, "దుర్యోధనా, నువ్వు ముందుగా రావడం నిజమే. కాని నేను ముందుగా అర్జునుణ్ణి చూశాను. అందుచేత మీ ఇద్దరికీ సహాయపడడమే నాకు ధర్మం అనిపిస్తోంది. అయితే ఒక షరతు. నా బలగాన్ని రెండుగా విభజిస్తాను. నా వద్ద ఉన్న అజేయమైన సైన్యం నారాయణసైన్యం అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. అది ఒక భాగం అయితే నేను రెండవ భాగం. నేను ఆయుధం పట్టను, యుద్ధం చేయను. అవసరమైతే సలహా చెపుతాను. నారాయణసైన్యం ఒక వైపు, నేను రెండవవైపు. ఈ రెండింటిలో ఎవరికి ఏది ఇష్టమో ఎంచుకోండి. అయితే, మొదట చిన్నవాళ్ళు కోరడం ధర్మం. అర్జునా! నువ్వు ఇద్దరిలో చిన్నవాడివి కనుక నువ్వు ముందు కోరుకో!" అన్నాడు. అర్జునుడు ఎంతో ఆనందంగా శ్రీకృష్ణుడే తనకు కావాలని కోరాడు. ఇది చూసి, అర్జునుడు మోసపోయాడని మురిసిపోతూ, దుర్యోధనుడు నారాయణసైన్యాన్ని తన భాగంగా తీసుకుని, తర్వాత

*బలరాముడి వద్దకు వెళ్ళాడు. బలరాముడు తాను ఎవరి పక్షమూ వహించనని చెప్పి దుర్యోధనుణ్ణి పంపివేశాడు.*

*తర్వాత కృష్ణుడు అర్జునుణ్ణి, "అర్జునా! పరాక్రమవంతులైన నారాయణ సైన్యాన్ని దుర్యోధనుడు కోరితే, కనీసం ఆయుధమైనా పట్టనని శపథం చేసిన నన్ను నువ్వు కోరుకున్నావు. నా వల్ల మీకు ఏ ప్రయోజనం కలుగుతుంది?" అని అడిగాడు.*

*అర్జునుడు నవ్వి, "కృష్ణా! నువ్వే కనుక యుద్ధం చేస్తే గెలిచిన కీర్తి నీకే వస్తుంది. కాబట్టి యుద్ధం చేయమని నిన్ను నేను కోరను. ఇక నీవు ఏ పక్షంలో ఉంటే ఆ పక్షాన్ని ఓడించడం అసాధ్యం. అందుచేత విజయానికి మూలకారణమైన నువ్వు మా పక్షానే ఉండాలి. అయితే నాదొక విన్నపం! ఈ మహాయుద్ధంలో నీవు నా రథానికి సారథ్యం చేయాలి. ఈ కోరిక నాకు చిరకాలంగా ఉంది. ఈ కోరికను మన్నించు!" అంటూ చేతులు జోడించాడు. "నీ కోరిక చెల్లించడమే నా వ్రతం. జరగబోయే యుద్ధంలో నేనుగా ఆయుధం పట్టను కానీ, తప్పక నీ రథానికి సారథిగా ఉంటాను!" అని కృష్ణుడు అర్జునుడికి అభయమిచ్చాడు.*

'*మన మీద మనకు విశ్వాసం, భగవంతుడి మీద విశ్వాసం, ఇవే విజయానికి మార్గాలు!*' అని స్వామీజీ చెప్పినట్టు మనం చదివాము. అర్జునుడి ప్రవర్తన మనకు ఆ విధంగానే కనిపిస్తుంది. యుద్ధంలో పాండవులు తమ శక్తితోనే యుద్ధాన్ని గెలువగలరని అతడికి తెలుసు. అయితే, భగవంతుణ్ణే తమ పక్షాన ఉంచుకోవడం కూడా అంతే ముఖ్యం. దైవికమైన శక్తియే మన సంకల్పశక్తికి ఊతమనీ, అదే మనం చేయవలసిన మంచి పనుల్ని మనచేత చేయిస్తుందనీ, మనల్ని మంచి త్రోవలో ముందుకు తీసుకుపోతుందనీ మనం చదివాము. మనం చేసే పనులు ధర్మబద్ధమైనప్పుడు, మన మనస్సు నిస్వార్థంతో నిండివున్నప్పుడు, భగవంతుడే మన పక్షం వహిస్తాడు.

## 43. మానవజీవితమే ఒక కురుక్షేత్ర సంగ్రామం

కౌరవులకు పాండవులకు మధ్య జరిగిన కురుక్షేత్రయుద్ధాన్ని ధర్మయుద్ధం అంటారు. ఇటువంటి యుద్ధంలో ఉభయ సైన్యాల నాయకులూ కొన్ని నియమాలు ఏర్పరుచుకుని, వాటి ప్రకారమే యుద్ధం చేశారు. ఈ నియమాలను అమలు చేయడంలో వారి ఉద్దేశ్యం ఏమిటంటే పరాక్రమం కలిగిన పక్షమే యుద్ధంలో నెగ్గాలని.

దుర్యోధనుడివైపు భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, అశ్వత్థామ మొదలైన వీరులు, అనేక మంది రాజులతోపాటు 11 అక్షౌహిణుల సైన్యం వచ్చి చేరింది. ధర్మరాజు వైపు మిగిలిన పాండవులు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, ద్రుపదుడు, విరాటుడు మొదలుగా అనేకమంది రాజులు, 7 అక్షౌహిణుల సైన్యం వచ్చి చేరాయి. వారందరూ కురుక్షేత్రం అనే ప్రదేశంలో (ప్రస్తుత హర్యానా రాష్ట్రం) మోహరించారు.

యుద్ధం మొదటిరోజున, రథాన్ని రెండు సైన్యాల మధ్యకు నడుపమనీ, ఒకసారి తాను అందరినీ చూస్తాననీ అర్జునుడు కృష్ణుణ్ణి కోరాడు. కృష్ణుడు రథాన్ని రెండు సైన్యాల మధ్యలో నిలిపాడు. అక్కడి పరిస్థితిని, భగవద్గీత చెప్పబడిన విధానాన్ని స్వామీజీ వివరిస్తూ, "ఆనాటి దృశ్యం ఒక యుద్ధభూమి. అప్పటి వరకూ బంధుమిత్రులైనవారే ఆనాడు రెండు పక్షాలుగా చీలిపోయి ఎదురెదురు నిలబడ్డారు. ఒక సోదరుడు ఒకవైపు ఉంటే మరొక సోదరుడు ఒకవైపు ఉన్నాడు. తాత ఒకవైపు ఉంటే, మనుమడు ఎదుటివైపు ఉన్నాడు... తన బంధుమిత్రులే వైరిపక్షంలో ఉన్నారనీ, తాను వారిని చంపవలసి వస్తుందనీ మనస్సులో తోచేసరికి, అర్జునుడికి గుండె జారిపోయి, నేను యుద్ధం చేయలేనని అన్నాడు" అని వ్యాఖ్యానించారు. అర్జునుడికీ, కృష్ణుడికీ ఇక్కడ జరిగిన సంవాదమే భగవద్గీతగా ప్రఖ్యాతి గాంచింది. 'కృష్ణా! ఈ రాజ్యం కోసం నా బంధువులనందరినీ చంపుకోలేను. ఈ రక్తపు కూడు తినేకన్నా తిరిగి అడవులకు పోవడమే నయం. సొంత మనుష్యులను కడతేర్చాలన్న ఆలోచన చేస్తుంటే, నాకు నోరు ఎండిపోతోంది. కళ్ళు

*తిరుగుతున్నాయి. నేను యుద్ధం చేయలేను!' అని అర్జునుడు అన్నాడు. ఇది విని కృష్ణుడు అర్జునుడికి అతడి కర్తవ్యమేమిటో బోధించాడు.*

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్యం అకీర్తకరం అర్జున! ॥ (గీత 2:2)
క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥ (గీత 2:3)

*కృష్ణుడు: "ఇదేమిటి అర్జునా? ఈ క్లిష్టసమయంలో నీకు ఇటువంటి బలహీనత వచ్చిందేమిటి? మహోన్నతులైన ఆర్యుల సంతతికి చెందిన నీకు ఇది తగదు. ఈ దౌర్బల్యం నీకు స్వర్గాన్నీ, కీర్తినీ రెంటినీ రాకుండా చేస్తుంది."(గీత 2:2). "పార్థా! చూడబోతే నీవు నపుంసకుడిలాగా మాట్లాడుతున్నావే! ఈ ప్రవర్తన నీకు శోభ తీసుకురాదు. శత్రువులను నాశనం చేసే ఓ వీరుడా! బంధువుల పట్ల నీవు చూపుతున్న ఈ అనురాగం కేవలం బలహీనత మాత్రమే! అది చాలా హీనమైనది. దాన్ని విదిల్చిపారవెయ్యి! లేచి నిలబడు!" (గీత 2:3)*

పైన చెప్పబడినన 2:3 శ్లోకం చాలా ముఖ్యమైనదని స్వామీజీ చెప్పారు. *"క్లైబ్యం మాస్మగమః పార్థ!.. అని మొదలయ్యే ఈ శ్లోకాన్ని అర్థం చేసుకుని ఒంటబట్టించు కుంటే, భగవద్గీత మొత్తాన్ని చదివి అర్థం చేసుకున్న ఫలితాన్ని పొందుతాడు. ఎందుకంటే ఈ ఒక్క శ్లోకంలో భగవద్గీతా సారమంతా ఇమిడివుంది!"* అని చెప్పారు. ఈ శ్లోకాన్ని మన జీవితాలకు ఎలా అన్వయించుకోవాలో వివరిస్తూ, *"మనందరకూ జీవితమనేది ఒక అంతులేని పోరాటం. ...అలా పోరాడేటప్పుడు మనలోని బలహీనతలనూ, పిరికితనాన్నీ క్షమాగుణంగానూ, వైరాగ్యంగానూ చెప్పుకోవడానికి మనం ప్రయత్నిస్తాము. ఒక బిచ్చగాడు త్యాగం చేస్తాననడం బూటకం! (వాడి దగ్గర ఏమైనా ఉంటే*

*కదా త్యాగం చేయడానికి!) ఎవడైతే గట్టి దెబ్బ కొట్టగలడో వాడే క్షమాగుణాన్ని చూపగలడు! బలం కలిగిన వాడు నేను క్షమ చూపుతానంటే మనం నమ్మవచ్చు. బోలెడు సంపద ఉన్నవాడు త్యాగం చేస్తానంటే దానిలో గొప్ప ఉంది. ఎన్నో సార్లు, మన జీవితపోరాటంలో, మన సోమరితనం వల్ల, పిరికితనం వల్ల, పోరాటం మాని పారిపోయి, మనం చేసినది చాలా ధైర్యంగల పని అని ఆత్మవంచన చేసుకుంటూ ఉండడం మనకే అనుభవం"* అని స్వామీజీ చెప్పారు.

భగవద్గీత నుంచి మనం నేర్చుకోవలసినదేమిటో స్వామీజీ మరొక సందర్భంలో ఇలా వివరించారు. *"భగవద్గీత చాలా ముఖ్యమైన శ్లోకంతో ప్రారంభమవుతుంది. 'ఓ అర్జునా! ఈ బలహీనతను, ఈ నపుంసకత్వాన్ని వదిలిపెట్టి, నిలబడి యుద్ధం చెయ్యి!' అని కృష్ణుడు ఉద్బోధిస్తాడు. అప్పుడు అర్జునుడు కృష్ణుడితో వాదించడానికి ప్రయత్నిస్తూ, ఉన్నతమైన నీతులను ఏకరువు పెట్టడానికి ప్రయత్నిస్తాడు. పోరాటం కన్నా క్షమాగుణం ఎలా మెరుగైనదో వివరించడానికి ప్రయత్నిస్తాడు. అర్జునుడు తనను తాను సమర్థించుకోవడానికి ప్రయత్నించాడు కానీ కృష్ణుడి ముందు అతడి ఆటలు సాగవు. కృష్ణుడు అతడి వాదనలోని బలహీనతను ఇట్టే కనిపెట్టాడు. అర్జునుడు తన బలహీనత వల్లనే యుద్ధం చేయనంటున్నాడు. తన బంధుగణాన్ని తానే చేతులారా చంపుకోలేనన్నదే అతడి బలహీనత..."* అంటూ స్వామీజీ అర్జునుడి బలహీనతను వివరించారు. *"అర్జునుడి హృదయంలో విరుద్ధభావాలైన మమకారం (భావోద్వేగం), కర్తవ్యం (బాధ్యత)* పెనుగులాడుతున్నాయి. పక్షుల, జంతువుల

స్వభావం కలిగిన మనుష్యులు, ఈ భావోద్రేకపు నరకంలో కొట్టుమిట్టాడుతూ ఉంటారు. ఆ భావోద్వేగాన్నే (emotion) మనం అందంగా 'ప్రేమ' అని అంటాము! సాధారణంగా, జంతువులలాగా మనం కూడా ఆ భావోద్వేగాల వశంలోనే ఉంటాము. ఒక ఆవు తన దూడ కోసం తన ప్రాణాన్నే అర్పించగలదు. నిజానికి, అన్ని జంతువులూ అలా చేయ గలవు. అయితే దానిలో గొప్ప ఏముంది? అలా జంతువుల లాంటి గుడ్డి మమకారం, భావోద్వేగం మనల్ని పరిపూర్ణత్వా నికి చేర్చదు. ...దేనికీ తొణకని నిత్యచైతన్యస్థితిని పొందడమే మనిషి జీవితగమ్యం! దాని సాధనలో ప్రాపంచిక స్థాయిలోని ఈ భావోద్వేగాలకు, అహంకార మమకారాలకు తావులేదు" అని చెపుతూ, అర్జునుణ్ణి పోరాడమని ప్రోత్సహిస్తున్న కృష్ణుడు, నిజానికి మనిషి తన జీవితగమ్యాన్ని చేరుకొనే మార్గాన్ని వివరించాడని స్వామీజీ అన్వయించారు.

## 44. దుర్మార్గాన్ని ఎదుర్కోగలవాడే క్షమ చూపగలడు

***శ్రీకృష్ణుడు యుద్ధం చేయడం యొక్క ఆవశ్యకతను ఈ విధంగా వివరించాడు: "నీవు విచారించాల్సిన అవసరంలేని దాన్ని గురించి విచారిస్తూ, గొప్ప తెలివిగలవాడిలాగా మాట్లాడుతున్నావు. చనిపోయిన వారిని గురించి కానీ, బ్రతికున్న వారిని గురించి కానీ, జ్ఞానులైనవారు శోకించరు. నీ నిజస్వభావం ఏమిటో నీవు తెలుసుకో! చావుపుట్టుకలు లేనిదీ, సుఖదుఃఖాలకు అతీతమైనదీ అయిన ఆత్మస్వరూపుడివి నువ్వు. నీవు చంపేవాడివీ కాదు, వాళ్ళు చనిపోయే వారు కూడా కాదు. కాబట్టి వారిని గురించి విచారించనవసరం లేదు. ఏదో ఫలం ఆశించి కాక, అన్యాయాన్ని ఎదుర్కోవడం కోసం మాత్రమే యుద్ధం చెయ్యి. ధర్మాన్ని నిలబెట్టడం కోసం యుద్ధం చేయడంలో ఏ తప్పూ లేదు. ఎదురుగా***

***కనిపిస్తున్న వారు కాదు నీ శత్రువులు. వారిలోని చెడ్డతనమే నీ శత్రువు! దానితో యుద్ధం చెయ్యి!"***

***"నీవు సొంత బంధువులను చంపవలసి వస్తున్నదని విపరీతంగా విచారిస్తున్నావు కానీ, ఏ పరిస్థితులలో చంపవలసి వస్తున్నదో ముందుగా ఆలోచించు. ఎవరైతే ప్రక్కవారి స్త్రీలను, సంపదలను హరిస్తారో వారిని దుర్మార్గులు (ఆతతాయినులు - తెలుగులో ఆకతాయిలు) అని అంటారు. వారిని మరణశిక్షే సరి! క్షత్రియుడిగా ఈ దుర్మార్గుల్ని శిక్షించడం నీ ధర్మం. నీ ధర్మాన్ని నీవు నిర్వర్తించకుండా వెనక్కు తగ్గడం అవమానకరం, పరువు నష్టమే కాక మహాపాపం కూడా. కాబట్టి ఎట్టి పరిస్థితులలో ఈ యుద్ధ భూమి నుంచి పారిపోవద్దు."***

మన నమ్మకాల కంటే కూడా 'ప్రవర్తన' అంటే మనం ఎలా పని చేస్తున్నామన్నది ముఖ్యం. జీవహింస పాపం అని మన నమ్మకం. క్షమాగుణమే అత్యున్నతమని కొందరు వాదిస్తూ ఉంటారు. కానీ వీటిని ఆధారంగా చేసుకుని సమాజంలోని నేరస్థులను వదలివేస్తే, సమాజం అస్తవ్యస్తం అవుతుంది. ప్రభుత్వం సమాజంలోని దుర్మార్గులను, దుష్ట శక్తులను దునుమాడడంలో ఏమాత్రం సంకోచించకూడదు. అలా సంకోచిస్తే మొత్తం సమాజమే నాశనం అవుతుంది. స్వామీజీ ఈ ఆదర్శాలను చూసి తికమకపడకుండా ఉండడం ఎలాగో వివరించారు: *"అత్యున్నతమైన ఆదర్శం క్షమాగుణమేనని కర్మయోగి అయిన మనిషికి స్పష్టంగా తెలుసు. మనిషి ఆధీనంలో ఉండదగిన మహోన్నత శక్తియే ఈ క్షమాగుణం అని కూడా కర్మయోగికి తెలుసు. మరొక వైపు, దుర్మార్గాన్ని క్షమించకుండా మట్టుబెట్టడం కూడా ఈ క్షమాగుణమనే అత్యున్నతశక్తిని అభివ్యక్తీకరించే మార్గంలో ఒక మెట్టేనని కర్మయోగికి స్పష్టంగా తెలుసు. ఎందుకంటే,*

ఆ అత్యున్నత ఆదర్శమైన క్షమాగుణాన్ని చేరుకోక ముందు మనిషి దుర్మార్గాన్ని ఎదురుకోక తప్పదు, దాన్ని నిర్మూలించక తప్పదు. అదే అతడి కర్తవ్యం. ముందు మనిషిని పని చేయనివ్వండి. (దుర్మార్గం ఎదురైనప్పుడు) అవసరమైతే చెయ్యెత్తి కొట్టనివ్వండి! ఎప్పుడైతే మనిషి దుర్మార్గాన్ని ఎదుర్కోగల శక్తిని సంపాదిస్తాడో, అప్పుడు మాత్రమే అతడు క్షమాగుణాన్ని చూపడానికి అర్హత సాధించినవాడవుతాడు."

***'తాత్త్వికమైన దృష్టితో కాకుండా ప్రాపంచిక దృష్టితో చూచినా నీవు యుద్ధం చేయక తప్పదు!" అని ఉద్బోధిస్తూ, "యుద్ధంలో చనిపోయావా, నీకు స్వర్గం వస్తుంది. నెగ్గావా, రాజభోగాలనుభవిస్తావు. కాబట్టి లేచి నిలబడు! యుద్ధం చేయక తప్పదు!" అని కృష్ణుడు అన్నాడు.***

ఈ ప్రపంచమనేది ఒక వ్యాయామశాల. ఇక్కడికి వచ్చేది కేవలం మనల్ని మనం బలంగా తయారుచేసుకోవడానికే. వ్యాయామశాలలోనే మనం నివసించము. అక్కడికి వెళ్ళి, మనల్ని బలంగా చేసుకున్న తర్వాత అక్కడ నుంచి వెళ్ళిపోతాము.

యుద్ధభూమిలో పోరాడడానికీ, రోజువారీ జీవితంలోని సవాళ్ళను ఎదుర్కోవడానికి తేడా లేదన్నదే గీత ఉవాచ.

కాబట్టి, ఈ ప్రపంచంలో చావైనా, రేవైనా – పోరాడక తప్పదు. భగవంతుణ్ణి మనస్సులో పెట్టుకుని, ఎటువంటి ఫలితాన్నీ ఆశించకుండా పోరాడాలి, అంటే పని చేయాలి. ఏదోవొక కోరికతో పనిచేసేవాణ్ణి చూసి జాలిపడాలని గీత బోధిస్తుంది. కాబట్టి ఏదీ కావాలని కోరకుండా పనిచేయాలి. అలా చేసేవాడు గొప్ప ఏకాగ్రతతో పనిచేయగలుగుతాడు. తనకు తానే మేలు చేసుకుంటాడు, ప్రపంచానికి మేలు చేయగలుగుతాడు.



## 45. కోరిక లేకుండా పనిచేయడమే గీతాసందేశం

***అర్జునుడు ఈ బోధనను శ్రద్ధగా విన్నాడు. "నా మోహం పోయింది. నేనేమిటో నాకు తెలిసివచ్చింది. ఇక యుద్ధం చేస్తాను!" అని అర్జునుడు పలికి యుద్ధానికి సిద్ధపడ్డాడు.***

గీతాసారాన్ని స్వామీజీ ఇలా చెప్పారు: "అన్ని పనులనూ కోరిక లేకుండా చేయాలని గీత బోధిస్తోంది. పరమాత్మతో ఒకటై యోగస్థితిని సాధించినవాడు తాను చేసే పనులన్నింటినీ ఏకాగ్రతలో మునిగిపోయి చేస్తాడు. అలా చేసేటప్పుడు తన సొంతానికి ఏమీ కావాలని కోరడు. అలా చేసిన పని వల్ల ప్రపంచానికి మేలే కలుగుతుంది కానీ ఇసుమంతైనా చెడు జరుగదు. అలా పనిచేసే వారు తమ స్వార్థం కోసం

*ఏమీ చేయరు! ..గొప్ప చురుకుదనంతో పనిచేయడమనేదే భగవద్గీతలోని ప్రతి పుటలోనూ మనకు కనిపించే సందేశం. అయితే అంతటి పనిలోనూ అనంతమైన ప్రశాంతతను చూపాలి!"*

మానవజాతికి భగవద్గీతా సందేశాన్ని ఇప్పించేందుకు నిమిత్తమాత్రుడైన అర్జునుడు మానవాళి తరపున మాట్లాడి, అటువంటి అద్భుతమైన సందేశాన్ని మనకు అందేలా చేశాడు. అందుకు, అతడికి మనం ఋణపడి ఉన్నాము.

జీవితమనే యుద్ధరంగంలో ఎటువంటి పోరాటపటిమను చూపాలో, స్వామీజీ తానే తన జీవితంలో మనకు ఆచరించి చూపారు. ఆయన జీవితాన్ని చక్కగా చదివితే, ఆయన ఎటు వంటి గడ్డు పరిస్థితులను ఎదుర్కొన్నారో మనకు అవగతం అవుతుంది. అలాంటి క్లిష్టపరిస్థితులలో ఉన్నప్పుడే, ఎంతో మంది ఆయనను విమర్శించారు, ఆయన గురించి చెడుగా ప్రచారాలు చేశారు. అయినా, ఆయన అటువంటి పరిస్థితు లను, మనుష్యులను ధైర్యంతో, ఆత్మశక్తితో ఎదుర్కొన్నారు. ప్రపంచం మొత్తానికీ వేదాంత సందేశాన్ని అందించారు.

## 46. భయమే అన్నిదుర్మార్గాలకూ మూలం

యుద్ధపర్వం గురించి మహాభారతగ్రంథంలో చాలా విపులంగా వ్రాశారు. అయితే మనకు ఉపయోగపడే కొన్ని సంఘటనలను తెలుసుకుందాము.

***యుద్ధంలో కౌరవసైన్యాధ్యక్షుడైన భీష్ముడు చాలా ఘోరమైన యుద్ధం చేసి, పాండవసైన్యాలను కార్చిచ్చులాగా దహించాడు. పదిరోజులపాటు అతణ్ణి ఎలా పడగొట్టాలో పాండవులకు అర్థం కాలేదు. యుద్ధం తొమ్మిదవ***

రోజున కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా! భీష్ముడు తన శౌర్యంతో మన సేనను నాశనం చేస్తున్నాడు. నీవు అతణ్ణి ఎదుర్కొని పోరాడాలి. నీ ప్రతాపం ఎప్పుడు చూపిస్తావో నాకు అర్థం కావటం లేదు!" అని దెప్పి పొడిచాడు. అర్జునుడు తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో భీష్ముణ్ణి ఎదుర్కొన్నాడు. కవ్వించిన సింహంలాగా భీష్ముడు అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. అర్జునుడి, కృష్ణుడి శరీరాలను తన శరపరంపరతో తూట్లుపడేలా భీష్ముడు గాయపరచాడు. అప్పుడు అర్జునుడు ఒక వాడి గల బాణం సంధించి భీష్ముడి ధనుస్సును విరిచాడు. భీష్ముడు మరొక ధనుస్సును అందుకున్నాడు. అర్జునుడు క్షణంలో దాన్ని కూడా విరిచాడు. యుద్ధవిద్యలో అగ్రగామి అయిన భీష్ముడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ మరొక విల్లు అందుకుంటూనే కృష్ణుణ్ణి, అర్జునుణ్ణి తన బాణవర్షంతో ముంచెత్తి అర్జునుడికి కాలు చెయ్యి ఆడకుండా చేశాడు. ఒక స్థితిలో, అర్జునుడు భీష్ముణ్ణి చంపడానికి సంశయిస్తున్నాడంటూ కృష్ణుడు అలిగి, తానే భీష్ముణ్ణి చంపుతానంటూ తన చక్రాన్ని చేతిలోకి తీసుకుని రథం మీద నుంచి దూకి భీష్ముడివైపు నడువసాగాడు. ఇది చూసి అర్జునుడు రథం మీద నుంచి క్రిందికి దూకి కృష్ణుడి వెంట పరుగెత్తి, రెండు చేతులతోనూ అతణ్ణి నడుముచుట్టూ పట్టుకుని ఆపుదామని ప్రయత్నిం చాడు. కృష్ణుడు అర్జునుణ్ణి ఈడ్చుకుంటూ ముందుకు వెళ్ళసాగాడు. అప్పుడు అర్జునుడు, "కృష్ణా, నా పరువు నిలబెట్టు! రథం మీదకి దయచెయ్యి. యుద్ధం చేయనని ప్రతిజ్ఞ చేసిన నువ్వు మాట తప్పితే లోకం ఏమంటుంది? నేను రవ్వంత అలసిపోయాను. అది నువ్వు తప్పగా భావించవద్దు. ఇక మీదట నేను భీకరమైన యుద్ధంచేసి శత్రువులను నిర్మూలిస్తాను!" అని ప్రతిజ్ఞ చేశాడు. ఆ మాటలు విని శాంతించిన కృష్ణుడు రథం అధిరోహించాడు.

అయితే తొమ్మిదవనాటి రాత్రి పాండవుల కోరిక మేరకు భీష్ముడే తన మరణ రహస్యాన్ని వారికి చెప్పాడు. తన చేతిలో విల్లు ఉన్నంత కాలం దేవతలు కూడా తనను జయించలేరనీ, అయితే స్త్రీలమీద, స్త్రీగా పుట్టిన వారి మీద తాను బాణాలు వేయననీ, తనను చంపడానికే పుట్టిన ఆ శిఖండి తన మరణానికి కారణమవుతాడనీ భీష్ముడు వివరించాడు. ఆ ప్రకారమే శిఖండిని తన రథంలో ఎక్కించుకుని అర్జునుడు భీష్ముణ్ణి పడగొట్టాడు.

